శ్రీః

# ఋగ్వేద స్మార్తబ్రాహ్మణ నిత్యకర్మాష్టకమ్.

సస్వరాంధ్రప్రయోగమ్.

"స్వధర్మే నిధనం శ్రేయః"

బ్రహ్మశ్రీ "వేంపటి వేంకటసోమయాజినః" తృతీయ
పుత్రేణ "సుబ్రహ్మణ్య సోమయాజినా" గ్రథితం

"ఆయుర్వేదవిశారద" "గోవిందవఝ్ఝుల వెంక
ట్రామశర్మణా మునిఖండాగ్రహారస్థిత
స్వకీయ "శ్రీపండితరాయముద్ర
ణాలయే" ముద్రాపితం
ప్రకాశితమ్ చ

ప్రథమ ముద్రణమ్ ౫౦౦.

౧౯౩౭

---

 [మూల్యమ్ రూప్యకత్రయమ్

# విజ్ఞప్తి



గమనింపు:— బ్రహ్మయజ్ఞాంగ దేవతర్పణములో మొదటగా౧అగ్నిస్తృప్యతు, ౨విష్ణుస్తృప్యతు, అనితర్పణము చేసినతరువాత ౩ప్రజాపతిస్తృప్యతు మొదలు "ఏవమంతానితృప్యతు" వరకుఁదర్పణ చేయవలెను. ఋషితర్పణలో౧౨"మహాసూక్తాస్తృప్యంతు"తరువాత"౧౩సనకస్తృప్యతు, ౧౪సనందన..., ౧౫సనాతన..., ౧౬సనత్కుమార..., ౧౭సనత్సుజాత..., ౧౮కపిల..., ౧౯వోఢు..., ౨౦పంచశిఖాస్తృప్యతు" యనిచేర్చుకొనవలెను.

పురుషసూక్త దేవతార్చనయందు పీఠపూజానంతరము పీఠనైవేద్యమును పూజాంతమునందు శంఖనైవేద్యమును జేర్చుకొనవలయును.

యజ్ఞోపవీత ధారణములో (౩౩౩పుటలో)

| | |
|---|---|
| ఇతిసంకల్ప్య | (ఇట్లు సంకల్పించి) తరువాత |
| పూర్వవత్ ద్వితీయయజ్ఞోపవీతం ధృత్వాఽఽచమ్య | పైమంత్రముచెప్పి ౨వ,యజ్ఞోపవీతమును ధరించి యాచమించి |

తృతీయ యజ్ఞోపవీతధారణమ్

ఉత్తరీయార్థం తృతీయయజ్ఞోపవీతధారణం కరిష్యే

| | |
|---|---|
| ఇతిసంకల్ప్య | అనిసంకల్పించి |
| పూర్వవత్ తృతీయయజ్ఞోపవీతంధృత్వా ద్విరాచమ్య | పైమంత్రముచే ౩వ యజ్ఞోపవీతమును ధరించి రెండుసారులాచమించి |

పూర్వోక్త + + ప్రీత్యర్థమ్ యజ్ఞోపవీతాంగ యథాశక్తి గాయత్రీమంత్రజపం కరిష్యే

(న్యాసపూర్వకముగా గాయత్రీమంత్రజపముజేసి)

తత్సర్వం బ్రహ్మార్పణమస్తు ॥

జీర్ణోపవీత విసర్జనమ్

(ఉపవీతవిసర్జనే కేచిదిమం శ్లోకం పఠంతి)

శ్లో॥ ఉపవీతం ఛిన్నతంతుం జీర్ణం కశ్మలదూషితం ।

విసృజామి యశో బ్రహ్మ వర్చో దీర్ఘాయురస్తు మే ॥

| | |
|---|---|
| ఇతి జీర్ణముపవీతమున్ముచ్య | పైశ్లోకమును చెప్పి పాతయజ్ఞోప |
| జలే విసృజ్య | వీతమును దీసి నీటిలో వైచి |
| ద్విరాచమేత్ | రెండు సారులాచమించవలెను. |

గ్రంథ సంగ్రహకర్త నగు నేను పరీధావి సంవత్సరములో "తైత్తిరీయ స్మార్త బ్రాహ్మణ నిత్యకర్మాష్టక" మను గ్రంథముఁ జూచి, ఋగ్వేదములోఁ గూడ నిట్టి గ్రంథరాజ మున్న బాగుండుననిఁ దోచి యనేక పండితులతో ముచ్చటింపగ ప్రయోజనము లేకపోయెను. కాని ఈశ్వరానుగ్రహము వలన నా కోరిక నేటికి కార్యరూపముఁ దాల్చెను. ఇది పండితులచేఁ బరిశోధింపబడెను. పండితులిందుగల లోపములఁ దెలిపిన ద్వితీయముద్రణములో సవరించగలవాడను.

ఇట్లు పండితవిధేయుడు
వేంపటి సుబ్రహ్మణ్యసోమయాజులు.

# — విషయసూచిక. —



# — సాంకేతాని. —



ప= మా= పరాశరమాధవీయమ్

ఋ= సం= ఋగ్వేదసంహిత

అష్ట= అష్టకమ్

మం= మండలమ్

స్మృ= ము= స్మృతిముక్తాఫలే

ధ= ప్ర= ధర్మప్రవృత్తి

ఆశ్వ= సూ= ఆశ్వలాయన గృహ్యసూత్రమ్

ఆ= ప= ఆశ్వలాయన గృహ్యపరిశిష్టమ్

ఆ= స్మృతి= ఆశ్వలాయనస్మృతి

ముం= ఉ= ముండకోపనిషత్

గౌ=ఆ=సూ=గౌతమ ఆచారసూత్రమ్



# ఋగ్వేద స్మార్త బ్రాహ్మణ నిత్యకర్మాష్టకము.

శ్రీశంకరగురవేనమః

శ్లో॥ సదాకాశచిదానందసదేకరసరూపిణే।
నిత్యశుద్ధనిరాభాసకూటస్థాయాత్మనేనమః ॥౧॥

శ్లో॥ ఆనందఘనమద్వంద్వం। నిర్వికారం నిరంజనమ్
భజేహంఽభగవత్పాదం।భజతామభయప్రదమ్॥౨॥

శ్లో॥ఋగ్వేదకల్పసూత్రాణాం। కర్తారం వచసాం నిధిమ్
ఆశ్వలాయనమానీన్ద్రం। భగవంతం నమామ్యహమ్ ॥3॥

శ్లో॥ కాలజ్ఞం సర్వవేదార్థభాష్యకర్తారమున్నతమ్।
విద్యారణ్యస్వామినం తం మహాత్మానం భజామ్యహమ్ ॥౪॥

శ్లో॥ బౌద్ధాది దుర్మతారణ్యమూలచ్ఛేదకృతం మునిమ్
అద్వైతసన్మతప్రాప్తి।కారణంజ్ఞానకారణమ్ ॥౫॥

శ్లో॥ శ్రీమత్పరమహంసశ్రీ । పరివ్రాజకభూషణమ్
జగద్గురుం మహాప్రాజ్ఞం । శంకరాచార్యమాశ్రయే ॥౬॥

# కృతిసమర్పణమ్.

శ్లో॥ నిత్యాగ్నిహోత్రిసందీప్తం। శ్రౌతస్మార్త ప్రవీణకమ్
అపారబుద్ధిసంయుక్తం । సత్యశీలమకల్మషమ్ ॥౧॥

శ్లో॥ ఉదారభావగంభీరం । మహేతుప్రాప్తవర్ధనమ్।
అత్యల్పధనసంతుష్టం। మదీయజనకంగురుమ్ ॥౨॥

శ్లో॥ వేంపట్యన్వయసద్రత్నం । వేదశాస్త్ర ప్రవీణకమ్।
శాతం బహ్మావిద్యాజితనూజంనైష్ఠికోత్తమమ్ ।3।

శ్లో॥ శ్రీమద్వేంకటయజ్వానం। సర్వశిష్యప్రబోధకమ్।
సత్త్వైతముత్తమంగ్రంథం । దత్వార్థాయ, తెమా
శ్రయే ॥౪।

శ్లో॥ సర్వగ్రహాన్ సర్వతారాః । సర్వర్షీన్ సర్వదేవ
తాః।
సర్వశాస్త్రప్రవీణాంస్తాన్ । సర్వాన్ భక్తాన్న
మామ్యహమ్ ॥౫॥

# —ఉపోద్ఘాతము.—

## అష్టాచత్వారింశత్సంస్కారవివరణమ్.

శ్లో॥ జంతూనాం నరజన్మదుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా।
తస్మాద్వైదిక ధర్మమార్గ పరతా విద్వత్త్వమస్మాత్పరమ్।
ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితః
ముక్తిర్నో శతకోటి జన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే భగవాన్ శంకరః॥

తా॥ జంతువులలో మనుష్యుడై పుట్టుట దుర్లభము. ఆమానవులలో మగవాడై పుట్టుట, ఆ మగవారిలో బ్రాహ్మణుడై పుట్టుట, ఆ బ్రాహ్మణులలో వేదోక్తధర్మమునందు ఆసక్తి యుండుట, అందులో పండితుడగుట మిక్కిలిదుర్లభము. ఆపండితులలో ఆత్మానాత్మలను తెలిసికొనుట, అందు నిర్వికల్పసమాధియును పిదప ముక్తి, ఇవి యనేక జన్మల పుణ్యవిశేషము వలనగాని లభించదు.

కావున యనేకకోటిజన్మల పుణ్యవిశేషముచే లభించినయీ బ్రాహ్మణజన్మను వృధాచేసికొనక ప్రతివాడును ముక్తికి [జన్మరాహిత్యమునకు] ప్రయత్నించవలెను. ఆముక్తి చిత్తశుద్ధివలనగాని కలుగదు. చిత్తమాలిన్యము తొలఁగుటకుగాను చిత్తమును స్వధర్మానుష్ఠానముచే యనగా, స్వస్వ వర్ణాశ్రమాచారవిహిత నిత్యకర్మాచరణముచే, సంస్కరింపవలెను. అప్పుడుగాని బ్రహ్మజిజ్ఞాసకధికారము కలుగును. ఈసంస్కారములు ౪౮. అవివరింపన:—

సంస్క్రియతే జ్ఞాన యోగ్యతామాపద్యతే పురుషస్య చిత్తమనేనేతి సంస్కారః॥

దీనిచే శారీరకముగాను ఆత్మనిష్ఠముగాను పురుషుని చిత్తము బ్రహ్మజ్ఞానము నొందుటకు యోగ్యమగునటుల సంస్కరింపఁబడును గనుక సంస్కారమనఁబడును. చిత్తశుద్ధియే సంస్కార ఫలము.

గౌతమ సూత్రే:—

౧. గర్భాధానం= గర్భః ఆధీయతే యేన నిషిక్తం వీర్యమమోఘం భవతి తద్గర్భాధానం (నిషేకః) నిషేకాద్బైజికం చైనో గార్భికం చాపమృజ్యతే.

౧. దీనిచే గర్భమున విడువఁబడు వీర్యమమోఘమై గర్భమును ధరింపఁ నిడును. గాన నిది గర్భాధానమనఁబడును. ఈసంస్కారము వలన బీజదోషముగర్భదోషము శాంతించును.

౨. పుంసవనం= పుమాన్ సూయతే తత్ పుంసవనం, గర్భపాత్రి సంస్కారః.

౨. ఈకర్మచేసిన పుత్త్రుఁడు కలుగును. గనక పుంసవనమని చెప్పఁబడును. ఇది గర్భపాత్ర సంస్కారము.

3. సీమంతోన్నయనం-సీమంతస్య= కేశరచనా విశేషస్య ఉన్నయన= ముత్తోలనమత్రేతి సీమంతోన్నయనం, గర్భ సంస్కారభేదః.

3. సీమంతము సమానముగ నెత్తియొత్తుచు చేయు నొక గర్భసంస్కారము.

౪. జాతకర్మ, "గర్భాంబుపానజో దోషః జాతాత్సర్వోఽపి నశ్యతి"

౪. ఈజాతకర్మ సంస్కారమువలన గర్భమునందు శిశువుచేయు గర్భజలపానదోషము నివర్తించును.

౫. నామకరణం. "ఆయుర్వర్చోఽభివృద్ధిశ్చ సిద్ధిర్వ్యవ

౫. ఈకర్మవలన నాయుర్వృద్ధియుఁ దేజోవృద్ధియు, వ్యవహార సిద్ధియు,

స్మృతే స్తథా। నామకర్మఫలం త్వేతత్ సముద్దిష్టం మనీషిభిః" — కలుగునని ఋషులచే నుద్దేశింపఁబడినది.

౬. అన్నప్రాశనం, "అన్నాశనాన్మాతృగర్భమలాశాదపి శుద్ధ్యతి" — ౬. ఈసంస్కారము వలన మాతృగర్భసంబంధమగు మలవస్తుసేవనము వలన దోషము సైతముపోవును.

౭. చౌడః, "బలాయుర్వర్చోవృద్ధిశ్చ చూడాకర్మఫలంస్మృతమ్." — ౭. ఈసంస్కారమువలనబల,ఆయుస్తేజోవృద్ధులు కలుగును.

౮. ఉపనయనం "ఉపనీతేః ఫలంత్వేతత్ ద్విజతాసిద్ధిపూర్వకా। వేదాధీత్యధికారశ్చసిద్ధిర్ఋషిభిరీరితా." — ౮. ఈసంస్కారమువలన ప్రథమమున ద్విజత్వసిద్ధియు, పిదప వేదాధ్యయనాధికారము సిద్ధించును.

ఏతానిపితృకర్తృకాని. — ఈ౮. సంస్కారములును తండ్రియొనర్పఁదగినవి.

౯. †మహానామ్నీవ్రతం "మహానామ్నీం దేవీముద్దిశ్యకృతం=మహానామ్నీవ్రతమ్." — ౯. ఈవ్రతమును ౧౩ఏటసలిపి "ఏవపంథాఏతత్కర్మ" అను ఆరణ్యకమునుచదువవలెను.

౧౦. మహావ్రతం=మహానామ్నీం దేవీముద్దిశ్య కృతంమహావ్రతమ్ — ౧౦. ఈవ్రతమును ౧౪ఏటసలిపి "మహామంత్రం" అను ఆరణ్యకమును చదువవలెను.

౧౧. ఉపనిషద్వ్రతం.ఉపనిష — ౧౧. ఈవ్రతమును ౧౫ఏటసలిపి

† ప్రాజాపత్యం, సౌమ్యం, ఆగ్నేయం, వైశ్వదేవం, ఈ౪ వేదవ్రతములు యజుర్వేదులకు.

దేవతా ముద్దిశ్య కృతం ఉపని షద్వ్రతమ్.

ఉపనిషత్తులను చదువవలెను.

౧౨. గోదానవ్రతం= గావగ ఖడ్యంతే అనేనేతి గోదాన వ్రతమ్

౧౨. ఈవ్రతమును ౧౬వ ఏట సిగలిపి మీసాలను తీసివేయవలెను.

ఇతిచత్వారివేదవ్రతానిఆచా ర్యకర్తృకాని.

పైనాలుగు వేదవ్రతములును వటువు నుద్దేశించి ఆచార్యుఁడు సలుపవల యును.

౧౩. సమావర్తనం= గురుకు లాత్సమావర్తనం యస్మిన్క ర్మణి తత్ సమావర్తనమ్.

౧౩.ఆచార్యునిగృహమునుండి వెడలి గృహస్థాశ్రమము స్వీకరించునిమిత్త ముఇంటికి వచ్చునప్పుడు దీనినొనర్ప వలయును. దీనినే స్నాతకమందురు.

౧౪. సహధర్మచారిణీ సం యోగః "దేవపితౄణాపగమం వివాహస్యఫలం స్మృతమ్.

౧౪. అనఁగావివాహము. దీనివలన దేవ పితౄ ఋణములఁదీర్చుకొనగల డు. ఆఋణములఁదీర్చుటయే వివా హమునకు ఫలము.

## —:పంచానాం యజ్ఞానా మనుష్ఠానమ్:—

౧౫. దేవయజ్ఞః=యజ్యతఇతి యజ్ఞః దేవేభ్యోయజ్ఞః దేవ యజ్ఞః "యదగ్నౌజుహోత్యపి సమిధం తద్దేవయజ్ఞస్సం తిష్ఠతే" ఇతిశ్రుతేః.

దీనినిచేయుటవలన దేవతలు తృప్తి నొంది మనకు వర్షాదికములొసంగు చు చిత్తశుద్ధిని కలుగఁజేయుదురు. అ గ్నియందు హవిస్సుగాని సమిత్తు లనుహోమముచేయుట దేవయజ్ఞము.

౧౬. భూతయజ్ఞః= "య ద్భూతేభ్యోబలిం హరతి

౧౬. వైశ్వదేవానుష్ఠానమునకు తరు వాత బహిర్దేశమున భూతతృప్తి

తదూర్ధ్వభూతయజ్ఞస్సంతిష్ఠతే" ఇతి శ్రుతిః

౧౭. పితృయజ్ఞః = యజ్యతఇతి యజ్ఞః పితృభ్యోయజ్ఞః పితృయజ్ఞః యత్పితృభ్యోదదాతి స పితృయజ్ఞః ఏతేన పిత్ర్యాహం పితృప్రీత్యర్థం ద్విజాయ ప్రదీయమానమన్నదానమప్యవగమ్యతే.

౧౮. బ్రహ్మయజ్ఞః = "యః స్వాధ్యాయమధీతే స బ్రహ్మయజ్ఞః."

౧౯. మనుష్యయజ్ఞః "యన్మనుష్యేభ్యోదదాతి సమనుష్యయజ్ఞః"

ఇతి తానేతాన్యజ్ఞాన్యహరహః కుర్వీతేతి.

కొరకు బలినిచ్చుట భూతయజ్ఞము.

౧౭. పితృప్రీతినిమిత్తము స్వధాకారమగు పిండప్రదానము. స్వధాకారముగ జలమిచ్చుటయు పితృతర్పణము, ద్విజులకు భోజనమిచ్చుటయు పితృయజ్ఞ మనఁబడును. దీనికే నిత్యశ్రాద్ధమందురు.

౧౮. నిత్యము శక్తికొలది వేదమభ్యసించుట (ఋక్కుగాని, యజస్సుగాని, సామముగాని) బ్రహ్మయజ్ఞము.

౧౯. శక్తికొలది నతిథిలగు బ్రాహ్మణులకు నన్నమిచ్చుట మనుష్యయజ్ఞమనఁబడును. (ఈ 5 యజ్ఞములకే వైశ్వదేవమని పేరు. వీనిఫలము పంచసూనానివృత్తి.) ఈ 5 మహాయజ్ఞములను ప్రతినిత్యము చేయవలెను.

## * అథ పాకయజ్ఞ సంస్థాః

౨౦. శ్రావణీకర్మ = శ్రవణానక్షత్రేణ యుక్తా పౌర్ణమాసీ శ్రావణీ, తత్ క్రియమాణా కర్మ శ్రావణీకర్మ.

౨౦. శ్రావణపూర్ణిమయందు చేయుహోమము శ్రావణీకర్మ.

* పాకేసంస్థా యేషాంతే పాకసంస్థాః పాకప్రధానా ఇత్యర్థః.

౨౧. సర్వబలి = సర్వేభ్యో బలిః.సర్వబలిః.

౨౨. ఆగ్రయణమ్=అగ్నేః అయనం భోజనం సస్యాదేర్యేన కర్మణా ఆగ్రయణం. నవాన్నాగమనాదినిమిత్తే సాగ్నికకర్తవ్యేయష్టి భేదే ఆగ్రయణం.

౨౩. ఆశ్వయుజీ = ఆశ్వయుజానక్షత్రేణ యుక్తా పౌర్ణమాసీ ఆశ్వయుజీ.

౨౪. ప్రత్యవరోహణం "ఆగ్రహాయణీ = ఆగ్రహాయణేన, మృగశీర్షా నక్షత్రేణ యుక్తా పౌర్ణమాసీ ఆగ్రహాయణీ, తత్రక్రియమాణంకర్మ ప్రత్యవరోహణశబ్దేనోచ్యతే."

౨౫. పార్వణః =పర్వణిభవః పార్వణః స్థాలీపాకః

౨౬. అష్టకాః= అశ్నంతి పితరో ౽స్యాంతిథౌ అష్టకాః "అష్టకాతు సమాఖ్యాతా సప్తమ్యాదిదినత్రయం."

౨౧. శ్రావణపూర్ణిమయందు సర్పబలిని చేయవలెను.

౨౨. దేనిచేత అగ్నిహోత్రునకు సస్యాదికము భోజనార్థముగా నియ్యబడునో ఆకర్మకు ఆగ్రయణమని పేరు. క్రొత్తధాన్యము ఫలించినవెంటనే అగ్నిప్రీత్యర్థము మొట్టమొదట నీ యిష్టియొనర్చియే మనమా ధాన్యము నుభుజింపవలెను.

౨౩. ఆశ్వయుజశుద్ధపూర్ణిమయందుచేయు కర్మకు "ఆశ్వయుజి" అని పేరు.

౨౪. మార్గశిరశుద్ధపౌర్ణమాసియందు చేయుకర్మకు హేమంతప్రత్యవరోహణమనియెదరు.

౨౫. పర్వమునందుచేయుటచే దీనికీ పేరుకలిగెను. ప్రతిపాడ్యమియందును దీనిని గృహస్థులొనర్పవలెను.

౨౬. ఈదినమునందు పితరులు భుజింతురుగాన అష్టకయని పేరు.(దీనిని మాఘబహుళసప్తమి,అష్టమి, నవమి, 3దినములు క్రమముగానొనర్చెదరు.)

* చైత్రీ-చిత్రానక్షత్రేణయుక్తా పౌర్ణమాసీచైత్రీ. ఏతచ్ఛూలగవ ఇత్యాశ్వలాయనానాం ఆపస్తంబీయైస్తు ఈశానబలిరిత్యభిధీయతే

ఇతి సప్త పాక యజ్ఞ సంస్థాః.

చైత్రి పూర్ణిమయందు చేయు శూలగవచైత్రి. దీనివలన గోవులు వృద్ధినొందును. దీనినే ఈశానబలి యని ఆపస్తంబుఁడనెను. [ఇదిమనకు పాకయజ్ఞములలోఁ జేరదు.]

ఈ ఏడును పాకయజ్ఞసంస్థలు.

౨౭. అగ్న్యాధేయం— అగ్నిరాధేయో యేన తత్ అగ్న్యాధేయం.

౨౭. అగ్నిహోత్రుఁడు దీనిచేత గ్రహింపఁబడును గాన అగ్న్యాధేయమని పేరు.

౨౮. అగ్నిహోత్రం- అగ్నయే హూయతే అత్రేతి అగ్నిహోత్రం.

౨౮. ఇందు అగ్నికొఱకు హోమము చేయుదురు గాన అగ్నిహోత్రము

౨౯. దర్శపూర్ణమాసౌ-శుక్లకృష్ణపక్ష ప్రతిపదోః క్రియమాణౌ ఇష్టిభేదౌ దర్శపూర్ణమాస శబ్దేన వ్యవహ్రియతే.

౨౯. అమావాస్య రెండు ప్రతిపత్తులందు చేయవలసిన ఇష్టిభేదములను దర్శపూర్ణమాసములందురు. ఇవి చేయఁడేని హవిర్యజ్ఞము చేయుట కధికారి కాడు.

3౦. చాతుర్మాస్యాని-వైశ్వదేవ, వరుణప్రఘాస, సాక, మేధ, శునాసీరీయ సంజ్ఞాని చత్వారి వ్రతాని.

3౦. వైశ్వదేవము ౧ వరుణప్రఘాస ౨ సాకమేధము ౩ శునాసీరీయము ౪ ననునాలుగు వ్రతములు చాతుర్మాస్యములు.

3౧. శ్రాద్ధం-శ్రద్ధయా దీయత ఇతి శ్రాద్ధం. మాసిశ్రాద్ధ

3౧. శ్రద్ధచే నీయఁబడును గనుక శ్రాద్ధమని పేరు. దీనిని పితృప్రీతికొఱకు

* ఇదిమనకు పాకయజ్ఞములలోఁ జేరకపోయినను దీనినికూడా ఆచరించవలెను

మితి యావత్.

౩౨. నిరూఢపశుబంధః-నిత రాం రూఢః పశుబంధః ని రూఢపశుబంధః సోఽయం ని రూఢః పశుః షట్సు షట్సు మాసేషు కర్తవ్యస్సంవత్సరే సంవత్సరే వా.

౩౩. సౌత్రామణీ-సుత్రామా దేవతా అస్యేతి సౌత్రామణీ. ఇతి సప్త హవిస్సంస్థాః.

ప్రతిఅమావాస్యయందును చేయవలెను. దీనినే పిండపితృయజ్ఞమందురు.

౩౨. దీనియందు పశుబంధము తప్పక చేయుదురు. కావుననిరూఢ పశుబంధమని పేరు. దీనిని యాఱునెలల కొక సారిగాని సంవత్సరమునకొక తూరిగాని యొనర్చవలయును.

౩౩. దీనికి ఇంద్రుఁడధిదేవత గావున సౌత్రామణియని పేరు.

ఈ ఏడును హవిస్సంస్థలు.

సప్త సోమయజ్ఞ సంస్థాః

౩౪. అగ్నిష్టోమః. అగ్నేః స్తుతి సాధనం ఋక్సముదాయో అ వసానేఽత్ర అగ్నిష్టోమః

౩౫. అత్యగ్నిష్టోమః. అతి క్రాం తోఽగ్నిష్టోమం అత్యగ్నిష్టో మః. అధికఫలప్రదత్వాత్

౩౬. ఉక్థ్యః= ఉక్థసాధ్యత్వా త్ ఉక్థ్యః. ఉక్థానినామ అ ప్రగీతమంత్రసాధ్యాని స్తో త్రాణి.

౩౭. షోడశీ. "సయజ్ఞానాం షోడశ ధేన్ద్రియంవీర్యమాత్మా

౩౪. అగ్నిని స్తుతించు ఋక్సముదా యమంత్యమునను౦డుటచే నీసంస్కా రమునకు అగ్నిష్టోమమని పేరు.

౩౫. అగ్నిష్టోమమునకంటె నెక్కు డుఫలమిచ్చునది గనుక అత్యగ్నిష్టో మమని పేరు.

౩౬. అప్రగీత మంత్రసాధ్యములగు స్తోత్రములచే నీసంస్కారము చేయ బడును. కాన ఉక్థ్యమని పేరు.

౩౭. ప్రజాపతి సర్వయజ్ఞసంబంధ మును తేజోవంతమునగు భాగమును ౧౬ భేదములుగల దానిగ నొసర్చి

సమభిసమక్ష్య దత్తశ్శోడశ్యభవన్న వై షోడశీనామ యజ్ఞోఽస్తి" ఇతిశ్రుతిః

కాగ్రీస్తుఃడాయెను. అదియే షోడశి యను యజ్ఞమాయెను. ఆషోడశియజ్ఞము సోమయాగాంతర్గతమే గాని వేరు గాదు.

౩౮. వాజపేయః — వాజమన్నం ఘృతం వాపేయ మత్ర వాజపేయః

౩౮. ఈకర్మయందు అన్నమో లేక ఘృతమో స్వీకరించదగినది గనుక వాజపేయమని పేరు.

౩౯. అతిరాత్రః= అతిశయితా రాత్రిః అతిరాత్రః యాగభేదః

౩౯. ఒకరాత్రికంటె నెక్కుడుకాలమునందు చేయవలసినది గనుక అతిరాత్రమని పేరు.

౪౦. అప్తోర్యామః= అప్త్యర్థో యామః యజ్ఞః అప్తోర్యామః "యదాప్నోత్, తదాప్తోర్యామస్యాప్తోర్యామత్వం" ఇతిశ్రుతిః

౪౦. ఈయాగము చేయుటవలన దేవతలుపశ్వాదికమును పొందిరి. కావున దీనికి అప్తోర్యామమని పేరుగలిగెను.

ఇతి సప్తసోమయజ్ఞసంస్థాః ఇత్యేతే చత్వారింశత్ సంస్కారాః

ఈఏడునుసోమయజ్ఞసంస్థలు.

పైనఉదహరించిన ౪౦ యు సంస్కారములు.

## అథాష్టావాత్మగుణాః

౪౧. దయా= ఆపన్నస్య ద్వేష్టురపి రక్షణం దయా

౪౧. శత్రువునైనను ఆపత్తునుండి రక్షించుట దయయనబడును. అనగా సర్వభూతములయందు దయ.

౪౨. క్షాంతి- బాహ్యే అభ్యాంతరే వాఽపరేణ దుఃఖేడత్పాదితేఽపి కోపాభావః

౪౨. ఇతరులు తనకు దుఃఖము కలుగజేయగా మనమునందుగాని బయటగాని కోపములేకుండుట క్షాంతియు

౪౩ అనసూయా=గుణినాం గుణానాఽవిష్కరణం అసూయా తద్భిన్నా అనసూయా.

౪౪. శౌచం= నిందితసంసర్గ అభక్ష్యాదిపరిహార పూర్వకం స్వధర్మ వ్యవస్థాపనం శౌచం. "శౌచం సంకరవర్జనం" ఇతిస్మృతిః.

౪౫. అనాయాసః = శరీర పీడావహత్శుభద్రకర్మాచరణ మాయాసః. తద్భిన్నో అనాయాసః.

౪౬. మాంగల్యం = అప్రశస్తకర్మవర్జనపూర్వకం ప్రశస్తకర్మాచరణం మంగళం తద్భావః మాంగల్యం.

౪౭. అకార్పణ్యం = అదైన్యపూర్వకం సత్పాత్రే భక్త్యా శక్త్యాచ ప్రత్యహం దానమకార్పణ్యం.

౪౮. అస్పృహా=పరకీయవస్తున్యభిలాషః స్పృహా తద్భిన్నా

నంబడును. అనఁగా ఓర్పు.

౪౩. గుణవంతుల గుణాదుల వెల్లడి చేయకపోవుట అసూయ. అదిలేమిఅనసూయ.

౪౪. పతితులపొత్తును, అభోజ్యపదార్థములును పరిహారముచేయుచు స్వధర్మమును స్థాపించుటశౌచము. (స్వధర్మమునఁ బ్రవర్తించుట.)

౪౫. శరీరమునకాయాసకరములగుశుభకర్మల నొనర్చుట యాయాసము. తద్భిన్నము అనాయాసము.

౪౬. నింద్యము లగుపనులనువదలి ప్రశస్తములగు పనుల నొనర్చుట మంగళము. దానిభావము మాంగల్యము.

౪౭. లోభిత్వములేక సత్పాత్రునకు శక్తికొలదిభక్తితో ననుదినమిచ్చుట అకార్పణ్యము.

౪౮. ఇతరుల వస్తువులనపేక్షించుట స్పృహా. ఇందులకుభిన్నగుణముఅస్పృహా.

అస్పృహా.

ఇత్యష్టావాత్మగుణాః.

(ఈ ౮ ఆత్మగుణములు. ఈగుణాష్టకము నభ్యసించెనేని తప్పక చిత్తశుద్ధి కలుగును.)

యస్యైతేచత్వారింశ త్సంస్కారా అష్టావాత్మగుణాశ్చ సబ్రహ్మణస్సాయుజ్యం సాలోక్యంచ గచ్ఛతి.

ఎవ్వఁడీ నలుఁబది సంస్కారములఁ జెంది ఎనిమిది ఆత్మగుణములను కలిగి యుండునోవాఁడు బ్రహ్మలోకము బొంది బ్రహ్మసాయుజ్యము నొందును

యస్య ఖలు సంస్కారాణామేకదేశోఽపి అథాష్టావాత్మగుణాయది సబ్రహ్మణస్సాయుజ్యఁసలోకతాంచ గచ్ఛతి.

అట్లుకాకున్నను ఈ నలువదిలోకొన్ని సంస్కారములఁ జెంది యాత్మగుణాష్టకము కలిగియుండెనేని వాఁడుఁ బ్రహ్మలోకము నొందును. బ్రహ్మసాయుజ్యముఁ నొందును.

గౌతమధర్మసూత్రే ౮. ౧౪. ౨౪. "సచసంస్కారః శ్రవణాదాసతి జ్ఞానేఉపకరోతి."

ఈసంస్కారము వేదాంత విషయక శ్రవణమననాదికము కలిగినప్పుడు జ్ఞానవిషయమున మనుజునకు పకారము నొనర్చును.

ఈ ౪౮ సంస్కారములలో ౧—౧౬ బ్రహ్మ సంస్కారములు. ౧౭ — ౪౦ దైవ సంస్కారములు. ౪౧ — ౪౮ ఆత్మగుణములని స్థూలవిభాగము.

సర్వేపి స్వకర్తృకాః

అన్నియు స్వకర్తృకములే

## వేదములు. ౪.

౧. ఋగ్వేదము:— ౮ అష్టకములు. ౬౪ అధ్యాయములు. ౨౦౦౬ వర్గములు. మరియొకవిభాగము. ౧౦ మండలములు. ౧౦౦౭ సూక్తములుగలవు. దీనికి ఐతరేయబ్రాహ్మణమనియు, శాంఖ్యాయన బ్రాహ్మణమనియు, రెండు బ్రాహ్మణములు. ఆశ్వలాయన, శాంఖ్యాయన సూత్రములీవేదమునకు సంబంధించినవి.

౨. యజుర్వేదము:— కృష్ణయజుర్వేదమనియు, శుక్లయజుర్వేదమనియు ద్వివిధము.

౧. కృష్ణయజుర్వేదము—దీనికే తైత్తిరీయశాఖ యనిపేరు. ఇది మూడుభాగములు. సంహిత ౪౪ ప్రశ్నలు. బ్రాహ్మణము ౨౮ ప్రశ్నలు. ఆరణ్యకము ౧౦ ప్రశ్నలు. మొత్తము ౮౨ ప్రశ్నలు. దీనికి ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, హిరణ్యకేశీయ, భారద్వాజ వైఖానస కల్పసూత్రములు.

౨. శుక్లయజుర్వేదము:— ఇందు మాధ్యందిన శాఖ (వాజసనేయసంహిత)కణ్వశాఖయని రెండుశాఖలు.దీనికి ౪౦ అధ్యాయములు. ఈవేదమునకు శతపథబ్రాహ్మణము. పారస్కర, కాత్యాయనాది కల్పసూత్రములు.

3. సామవేదము:— ఈవేదసంహిత పూర్వార్చికము, ఉత్తరార్చికమని ద్వివిధము. అందు పూర్వార్చికము ౬

ప్రపాఠకములుగను. ఉత్తరార్చికము౯ ప్రపాఠకములుగను విభజింపఁబడినది. ఈ వేదమునకు తాండ్య బ్రాహ్మణ, షడ్వింశ బ్రాహ్మణ, సామవిధాన బ్రాహ్మణ, వంశ బ్రాహ్మణ, ఆర్షేయ బ్రాహ్మణ, దేవతాధ్యాయ బ్రాహ్మణ సంహితోపనిషత్ బ్రాహ్మణాద్యష్టవిధ బ్రాహ్మణములు. గోబిల, లాట్యాయన ద్రాహ్యాయణాదిక కల్పసూత్రములు.

౪. అథర్వణవేదము:— ఈసంహిత కాండములుగను, ప్రతికాండయు కొన్ని అనువాకములుగను విభజింపబడినది. దీనికి గోపథ బ్రాహ్మణము, కౌశికకల్పసూత్రము.

## ౨. షడంగములు.

శిక్షా వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అని వేదాంగములుఆరు.

౧. శిక్షా:— ఇది పాణిన్యాచార్య విరచితము. ప్రతివేదమునకు వేర్వేఱుగ శిక్షాగ్రంథములు గలవు. ఉ. సౌనక శిక్షా, భారద్వాజకశిక్షా.

౨. వ్యాకరణము:— ఇదియు పాణిన్యాచార్య విరచితమే. ఇది ౮ అధ్యాయములుగను, ఒక్కొక అధ్యాయము ౪ సి. పాదములుగను విభజింపఁబడియున్నది దీనికి పతంజలిమహర్షి భాష్యమును, కాత్యాయనుఁడు వార్త్తికముల నొనర్చెను. ఈభాష్యమునకే మహాభాష్యమని పేరు.

3. ఛందస్సు:— దీనిని పింగళ నాగాచార్యులు వ్రాసిరి. ఇవి ౧౮ భాగములు.

౪. నిరుక్తము:— దీనిని యాస్కుడొనర్చెను. ఇందు పూర్వషట్కము, ఉత్తరషట్కమని పేర్లుగల ౧౨ అధ్యాయముల పరిమాణము. దీనియందు వేదపదముల నిర్వచనము చక్కగ వ్రాయబడినది. పరిశిష్టముగ ౨ అధ్యాయములుగలవు. ఇది వైదికనిఘంటువునకు భాష్యరూపము. దీనికి దేవరాజయజ్వమున్నగువారు వ్యాఖ్యానము వ్రాసిరి.

౫. జ్యోతిషము:— ఈవేదాంగ జ్యోతిషశాస్త్రములు ప్రతివేదమునకు వేర్వేరుగ గలవు. లగధుడనుమహాత్ముడు దీనినివ్రాసిరి. ఇది ౭ ప్రకరణములు.

౬. కల్పము:— ఋగ్వేదమునకు ఆశ్వలాయన, శాంఖ్యాయనకల్పసూత్రములు. ప్రతివేదమునకును ప్రత్యేకముగ కల్పసూత్రములు గలవు. వీనియందు వేదమంత్రములకు వినియోగము తెలుపబడినది.

ఇవిగాక ప్రతివేదమునకు ప్రత్యేకముగ ప్రయోగమును తెలుపుటకు కల్పసూత్రములును, గృహ్యసూత్రములను, లక్షణము తెలుపుటకు ప్రాతిశాఖ్య శిక్షాగ్రంథములును గలవు.

# నిత్యకర్మాష్టక వివరణము.

శ్లో॥ 1సన్ధ్యా స్నానం 2జపో 3హోమో 4దేవతా
నాంచ పూజనమ్

5ఆతిథ్యం, 6వైశ్వదేవంచ, షట్కర్మాణి దినేదినే।

[ఇతిపరాశరస్మృతి ౧—౩౯]

తా॥ 1స్నానపూర్వకమైనసంధ్య, 2గాయత్రీజపము, 3హోమము, (అగ్నికార్యము (లేక) ఔపాసన) 4. దేవతార్చనము. 5. ఆతిథ్యము, 6. వైశ్వదేవము. అనునీయారుకర్మలు ప్రతిదినము చేయదగినవి. అనగా నిత్యకర్మలని భావము.

ఈకర్మలకు నిత్యము చేయదగు, బ్రహ్మయజ్ఞమును, పితృతర్పణంబును చేర్చితిమిగాన, నిత్యకర్మాష్టకము సిద్ధించును.

ప్రాతర్హోమానన్తరభావీని, బ్రహ్మయజ్ఞాన్తానిమూలవచనానుక్తాన్యాహ్నికక్రమ ప్రాప్తత్వాత్తాన్యుచ్యన్తే॥

శ్లో॥ "సన్ధ్యాస్నానం, జపహోమో దేవతానాంచ
పూజనమ్'

స్వాధ్యాయః పితృతర్పణం షట్కర్మాణిదినేదినే॥"

తా॥ ప్రాతర్హోమమునకు తరువాతజేయు బ్రహ్మయజ్ఞ,పితృతర్పణములు మూలవచనములో చెప్పకపోయినను "యత్స్వాధ్యాయమధీతేసబ్రహ్మయజ్ఞః" ఇతిసూత్రం. స్మృతిః. ఆహ్నికక్రమప్రాప్తంబులగుటంబట్టి, నాచారమునుబట్టియు ఇందువ్రాసితిమి. కావున నిత్యకర్మాష్టకమను పేరు సిద్ధించును.

# నిత్యకర్మానుక్రమణిక.

## బ్రాహ్మణుడు

౧. సూర్యోదయమునకు ముందు ౧౦ఘడియలకు (సుమారు 4గంటలకు) మేల్కొనవలయును.

౨. ప్రక్కమీద నుండియే భగవంతుని ప్రార్థించి ప్రాతస్స్మరణము చేయవలెను.

3. పిదప ఈదిగువ శ్లోకముఁజెప్పుచు భూమిం ప్రార్థించి మంచము దిగవలయును.

భూప్రార్థనా. శ్లో॥ సముద్రవసనేదేవి! పర్వతస్తనమండితే
విష్ణుపత్ని! నమస్తుభ్యం పాదస్పర్శం
క్షమస్వమే।

౪. శ్రీశుభవస్తు సందర్శనము చేయవలెను.

---

శ్రీ ప్రాతఃకాల దర్శనీయములు. శ్లో॥ శ్రోత్రియం శుభగం గాంచ అగ్ని
మగ్నిచితం తథా।
ప్రాతరుత్థాయ యఃపశ్యేదాపద్భ్యస్స
ప్రముచ్యతే॥ కాత్యాయనస

తా॥ ప్రాతఃకాలమున శ్రోత్రియుని, సజ్జనుని, గోవుని, అగ్నిని, అగ్నిహోత్రుని, చూచువారికి ఆపదలనుండి విముక్తి కలుగును.

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ।
కరపృష్ఠేతు గోవిందః ప్రభాతే కరదర్శనం॥

శుభవస్తువులులేనియెడ తనచేతిని తాను చూచుకొనవలెను. ఏల యనగా కరముయొక్క చివర లక్ష్మి, కరమధ్య సరస్వతీ, కరముయొక్క మొదట గోవిందుడు యుండును.

౫. ఇల్లువెడలి మలమూత్రములవిడిచి, దన్తధా వనము చేసుకొని ముఖమార్జనము చేయవలెను.

౧. స్నానము చేయవలెను.

౬. శుభ్రవస్త్రములను ధరించవలయును.

౭. జలముచే నూర్ధ్వపుండ్రము ధరించవలయును.

౧. సన్ధ్యావన్దనము తర్పణాన్తముచేసి

౮. మృత్తికచే నూర్ధ్వపుండ్రము ధరించి

౨. గాయత్రీజపము సూర్యోపస్థానమును చేసి సంధ్యావందనము పూర్తి చేయవలెను.

౩. నిత్యోపాసనముసలిపి, భస్మధారణము చేయవలెను.

౧. మాధ్యాహ్నిక స్నానము చేయవలెను.

౪. బ్రహ్మయజ్ఞమును చేయవలెను.

౫. పితృతర్పణమును చేయవలెను.

౧. మధ్యాహ్నిక సంధ్యావందనము చేయవలెను.

౬. దేవతార్చనము సలుపవలయును. వంటమైన పిదప

౭ వైశ్వదేవముచేసి తదన్నమును దేవతానివేదనము చేయవలెను.

౮ చన్దనముతో త్రిపుండ్రమును ధరించవలెను.

౯ అతిథులతోను పూజ్యులగు మాతాపితృలతోను

భుజించవలెను.

౧౦ పిదప నభీష్టదేవతాస్మరణముచేసి తాంబూలము వేసుగుని పురాణాదుల బఠింపవలయును.

౧౧. సాయంకాలమునమరల, సన్ధ్యోపాసన, దేవపూజ వైశ్వదేవములొనర్చి భోజనముచేసి తామ్బూలము వేసుకొని,

౧౨. భగవత్ప్రార్థనచేసి భార్యతో సరస సల్లాపములాడుచు శయనించవలయును.

# ప్రాతస్స్మరణము.

## శివస్మరణ.

శ్లో॥ ప్రాతఃస్మరామి భవభీతిహరం సురేశమ్।
గంగాధరం వృషవాహన మంబికేశమ్।
ఖట్వాంగశూలవరదాభయహస్తమీశమ్।
సంసారరోగహరణౌషధ మద్వితీయమ్।

శ్లో॥ ప్రాతర్నమామి గిరిశం గిరిజార్ధదేహం।
సర్గస్థితిప్రళయకారణ మాదిదేవమ్।
విశ్వేశ్వరం విజితవిశ్వమనోభిరామమ్।
సంసారరోగ హరణౌషధ మద్వితీయమ్ ॥౨॥

శ్లో॥ ప్రాతర్భజామి శివమేకమనంతమాద్యమ్।
వేదాంతవేద్య మనఘం పురుషం మహాన్తమ్।
నామాదిభేదరహితం షడ్భావశూన్యమ్।
సంసారరోగ హరణౌషధ మద్వితీయమ్ ॥3॥

శ్లో॥ ప్రాతస్సముత్థాయ శివం విచింత్య।
శ్లోకత్రియం యేఽను దినం పఠంతి।
తే దుఃఖజాతం బహుజన్మ సంచితం।
హిత్వాఽపదంయాంతి తదేవ శంభోః॥ ॥౪॥

శ్లో॥ యత్కృత్యం తన్నకృతం యదకృత్యం కృత్యవత్తదాచరితమ్।
ఉభయోః ప్రాయశ్చిత్తంశివతవనామాక్షరద్వయోచ్చరితమ్।

శివశివేతి శివేతి శివేతివా భవభవేతి, భవేతి భవేతివా।

హర హరేతి హరేతి హరేతివా భజ మనశ్శివమేవ నిరంతరమ్॥

శ్లో॥ నాగేంద్ర హారాయ త్రిలోచనాయ।
భస్మాంగరాగాయ మహేశ్వరాయ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ।
తస్మై నకారాయ నమశ్శివాయ। ॥౧॥

శ్లో॥ మందాకినీ సలిల చందన చర్చితాయ।
నందీశ్వరప్రమథ నాథ మహేశ్వరాయ।
మందారముఖ్య బహుపుష్ప సుపూజితాయ।
తస్మై మకారాయ నమశ్శివాయ॥

శ్లో॥ శివాయ గౌరీ వదనారవింద।
సూర్యాయ దక్షాధ్వర నాశనాయ।
శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ।
తస్మై శికారాయ నమశ్శివాయ॥

శ్లో॥ వసిష్ఠకుంభోద్భవ గౌతమాది।
మునీంద్రదేవార్చిత శేఖరాయ।
చంద్రార్క వైశ్వానర లోచనాయ।
తస్మై వకారాయ నమశ్శివాయ॥

శ్లో॥ యక్షస్వరూపాయ జటాధరాయ।

పినాకహస్తాయ సనాతనాయ।
సుదివ్యదేహాయ దిగంబరాయ।
తస్మై యకారాయ నమశ్శివాయ॥

శ్లో॥ పంచాక్షర మిదం పుణ్యం యఃపఠేచ్ఛివసన్నిధౌ।
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే॥

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచితం
శివపంచాక్షరస్తోత్రం
సంపూర్ణమ్.

# అథ శ్రీకృష్ణాష్టకప్రారంభః.

శ్లో॥ వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥౧॥

శ్లో॥ అతసీపుష్పసంకాశం హారనూపుర శోభితమ్।
రత్నకంకణకేయూరం కృష్ణం వందేజగద్గురుమ్।౨।

శ్లో॥ మందారగంధసంయుక్తం చారుహాసంచతుర్భుజమ్
బర్హిపింఛావ చూడాంగం కృష్ణంవందేజగద్గురుమ్।

శ్లో॥ ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్।
యాదవానాం శిరోరత్నం కృష్ణంవందేజగద్గురుమ్

శ్లో॥ రుక్మిణీకేళిసంయుక్తం పీతాంబరసుశోభితమ్।
అవాప్తతులసీగంధం కృష్ణంవందేజగద్గురుమ్ ॥౪॥

శ్లో॥ గోపికానాంకుచద్వంద్వం కుంకుమాంకితవక్షసమ్।

శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్

శ్లో॥ శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితమ్।
శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్ ॥౭॥

శ్లో॥ కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి ॥౮॥

శ్రీకృష్ణాష్టకం సంపూర్ణమ్.

# అథ శ్రీ మధురాష్టక ప్రారంభః

శ్లో॥ అధరం మధురం వదనం మధురమ్।
నయనం మధురం హసితం మధురమ్।
హృదయం మధురం గమనం మధురమ్
మధురాధపతేరఖిలం మధురమ్॥
శ్రీమధుసూదన తరుణోపాయమ్
కరుణాసింధో శరణం శరణమ్ ॥౧॥

శ్లో॥ వచనం మధురం చరితం మధురమ్।
వసనం మధురం వలితం మధురమ్।
చలితం మధురం భ్రమితం మధురమ్।
మధురాధిపతే ... శరణమ్ ॥౨॥

శ్లో॥ వేణుర్మధురో రేణుర్మధురః।
పాణిర్మధురః పాదౌ మధురౌ।

నృత్యం మధురం సఖ్యం మధురమ్।
మధురాధిపతే ... శరణమ్ ।3।

శ్లో॥ గీతం మధురం పీతం మధురం।
భుక్తంమధురం సుప్తం మధురమ్।
రూపం మధురం తిలకం మధురమ్।
మధురాధిపతే ... శరణమ్ ॥౪

శ్లో॥ కరణం మధురం తరణం మధురమ్।
హరణం మధురం రమణం మధురమ్।
వమితం మధురం శమితం మధురమ్।
మధురాధిపతే ... శరణమ్ ॥౫॥

శ్లో॥ గుంజా మధురామాలా మధురా।
యమునా మధురా వీచీ మధురా।
సలిలం మధురం కమలం మధురమ్।
మధురాధిపతే ... శరణమ్ ॥౬॥

శ్లో॥ గోపీ మధురా లీలా మధురా।
యుక్తంమధురం భుక్తంమధురమ్।
ఇష్టంమధురం శిష్టంమధురమ్.
మధురాధిపతే ... శరణమ్ ॥౭॥

శ్లో॥ గోపా మధురా గావోమధురా।
యష్టిర్మధురా సృష్టిర్మధురా।
దలితం మధుర ఫలితం మధురమ్।
మధురాధిపతే ... శరణమ్। ॥౮॥

ఇతి శ్రీమద్వల్లభాచార్య విరచితం
శ్రీమధురాష్టకం సంపూర్ణమ్

శ్లో॥ హరే! రామ! హరే! రామ! రామ! రామ! హరే! హరే!
హరే! కృష్ణ! హరే! కృష్ణ! కృష్ణ! కృష్ణ! హరే! హరే!

# ప్రాతస్సూక్తమ్.

ఛందస్సు-ప్రాతరగ్నిమితి సప్తర్చస్యసూక్తస్య। మైత్రావరుణిర్వసిష్ఠోభగగ ఆద్యాయాంఅగ్నీంద్రమిత్రావరుణాశ్వి భగపూష బ్రహ్మణస్పతి రుద్రాదేవతాః। అంత్యాయా ఉషా ఆద్యాజగతీ శేషస్త్రిష్టుభగ॥

ప్రాతరగ్నింప్రాతరింద్రం హవామహేప్రాతర్మి
త్రావరుణా ప్రాతరశ్వినా। ప్రాతర్భగం పూషణం బ్ర
హ్మణస్పతిం ప్రాతస్సోమముతరుద్రం హువేమ॥ ॥౧॥

తా॥ మేము ఉషఃకాలమందు అగ్నిని ఇంద్రుని (అహోరాత్రాభిమాని దేవతలగు) మిత్రావరుణులను, (దేవవైద్యులగు) అశ్వినులను, భగుని పూషను (మంత్రాభిమానియగు) బ్రహ్మణస్పతిని, సోముని, రుద్రునిపిలుచుచున్నారము.

ప్రాతర్జితం భగముగ్రంహువేమ వయంపుత్రమదితేర్యో

విధర్తా। ఆధ్రశ్చిద్యంమన్యమానస్తురశ్చిద్రాజా చిద్యం

భగంభక్షీత్యాహ। ॥౨॥

తా॥ ఎవ్వఁడీలోకంబులను ధరించుచున్నాడో, ఎవండుజయించుటయే స్వభావంబుగాఁగలవాఁడో, ఎవనినిదరిద్రుడైనను, గొప్పవాఁడగురాజైనను అభీష్టసిద్ధికై యాచించుచుందురో అట్టిభగను ఉషఃకాలమున మేము పిలుచుచున్నారము.

భగప్రణేతర్భగసత్యరాధో భగేమాం ధియముద

వాదదన్నః। భగప్రణో జనయ గోభిరశ్వైర్భగప్రనృభి

ర్నృవంతస్స్యామ॥ ॥3॥

తా॥ ఓభగుడా! నీవే ముఖ్యుడవు. నీవే సత్యధనుడవు. నీవు మేము వాంఛించుచున్న కోరికలను మాకొసంగి మాస్తుతిని సఫలముగ జేయుము. నీవు గోవులను, గుఱ్ఱములను, మాకుసమృద్ధిగనిమ్ము. నీయను గ్రహమువలన మేముపుత్రపౌత్రాదులను పొందుదుముగాక.

ఉతేదానీం భగవంతస్స్యామోతప్రపిత్వఉతమధ్యే

అహ్నాం। ఉతోదితా మఘవన్ త్సూర్యస్య వయందేవా
నాం సుమతౌ స్యామ॥ ॥౪॥

తా॥ ఓభగుడా! ఈయుప:కాలమునందు, ప్రాతఃకాలమునందు
ను మధ్యాహ్నమునందును మేము ధనవంతులమైయుందుముగాక. ధనవం
తుడగు ఓభగుడా! ఈ ఉదయమున ఇంద్రాది దేవతలందు రనీయను
గ్రహమువలన మాయందు దయగలిగియుందురుగాక.

భగఏవభగవాఁ అస్తుదేవాస్తేన వయంభగవన్తః స్యామ।
తంత్వా భగసర్వఇజ్జోహవీతిసనో భగపుర ఏతాభవేహ।

తా॥ ఓదేవతలారా! భగుఁడే ధనవంతుఁడగుగాక. అతనియను
గ్రహముచేతనే మేమును ధనవంతులమయ్యెదము. ఓభగుడా! జనులెం
దఱును నిన్నే సదాస్తుతిచేయుచు ఇష్టసిద్ధికై పిలిచెదరు.

౬. సమధ్వ రాయోషసోనమన్త దధికావేవ శు
చయే పదాయ। అర్వాచీనంవసు విదం భగంనోరథమివా

శ్వావాజినఆవహంతు ॥

తా॥ ఉషః కాలదేవత పవిత్రమును గమనయోగ్యమునగు ప్రదేశమునకు అశ్వమువలె మాయాగప్రదేశమునకువచ్చుగాక. ఉషఃకాలదేవత జవనశీలంబులగు అశ్వంబులు రధమునువలె ధనప్రాపకుఁడగు భగుని మాక భిముఖముగ తీసికొనివచ్చుగాక..

॥౭॥ అశ్వావతీర్గోమతీర్న ఉషాసో వీరవతీస్సదముచ్ఛం తుభద్రాః । ఘృతందుహానా విశ్వతః ప్రపీతా యూయంపాత స్వస్తిభిస్సదానః ॥

తా॥ కొనియాడఁదగిన యుషఃకాలదేవతలు ఉదకముచే తడుపుచుసకలగుణ సమృద్ధికలవై అశ్వములు, గోవులు, పుత్రాదిజనములు వీనితోడ కలిసి మాకుగల యంధకారమును పోగొట్టుగాక. ఇందు చెప్పబడిన దేవతలారా! మీరందఱు మమ్ములను కల్యాణవంతులనుగ పరిపాలింపుడు.

( ఋ. సం. అష్ట. 5. 4. 8. మం. 7. 8. 41. )



# (౧) ఆచమనము.

## (సామాన్య నియమము.)

శ్లో॥ నాచామేదాసనస్థాజ్ఘ్రిః నబద్ధాసనఏవవా।
నప్రసారితపాదోవా బహిర్జానుకరోఽపివా॥

తా॥ ఆచమించునపుడు పీటమైనఁగూర్చుండి పాదములు నేల మీద నుంచుకొనవలయును. పద్మాసనములు మొదలగు నాసనములు పట్టి యాచమించరాదు. కాళ్లుచాచుకొనికాని మోకాళ్లకు వెలుపల చేతులుంచిగాని యాచమించరాదు.

శ్లో॥ పవిత్రకరఆచమేత్ శుచిః కర్మార్థమాదరాత్।
సపవిత్రౌ సదర్భౌ వా కరౌ కుర్వీత నాన్యథా॥

తా॥ "పవిత్రం వై హిరణ్యం" అనికలదు గనుక బంగారుంగరము గాని, దర్భలుగాని వేళ్ళకుంచుకొని శుచియై, కర్మార్థమాచమించునది మరియొకవిధముగా నాచమించరాదు.

శ్లో॥ సన్ధ్యాయాం కర్మకాలే చ స్మృతేరాచమనం భవేత్।

తా॥ సన్ధ్యాది ప్రతికర్మకు ఆరంభమున పురాణాచమనముచేసి వెంటనే స్మృత్యాచమనమును, అంత్యమున స్మృత్యాచమనమును పిదప పురాణాచమనమును, సన్ధ్యమధ్యయందు స్మృత్యాచమనమును చేయవలెను.

### ఆచమన భేదములు.

౧. శ్రౌతాచమనము (శ్రుత్యాచమనము) ౨స్మృత్యాచమనము. ౩. పురాణాచమనము.

## శ్రౌతాచమనం.

శౌనకః॥ దేవ్యాగ పాద్యైస్త్రిభిగ పీత్వాబ్లింగైర్న్నవభిగస్పృశేత్
సప్తవ్యాహృతిభిశ్చైవ శిరోమంత్రైశ్చ పంచభిరితి।
ఆశ్వలాయనః॥ గాయత్ర్యాచ పిబత్యాదావాపోవా నవభిః
స్పృశేత్।
వ్యాహృతీభిశ్శిరోమంత్రై రంగాని బ్రహ్మ
యజ్ఞకే॥

తా॥ గాయత్రియొక్క పాదత్రయముచే మున్మారు ఆచమించునది. "ఆపోహిష్ఠా దులగు తొమ్మిది మంత్రములచేతను ఏడు వ్యాహృతులచేతను ఐదు శిరోమంత్రములచేతను అంగములను తాకునది.

### అంగవివరణమ్.

శ్లో॥ పాణిగండద్వయం చోష్ఠౌ పాణిపాదౌ శిరోముఖమ్।
నాసాబిలే౽క్షిణిశ్రోత్రే నాభిహృన్మస్తకాంసకావితి

తా॥ రెండుచేతులను, రెండుగండములను, రెండు పెదవులను, ఎడమచేతిని, పాదములను, శిరస్సును, ముఖమును, రెండుముక్కుపుటలను రెండుకండ్లను, రెండుచెవులను, బొడ్డును, హృదయమును, శిరస్సును, రెండుభుజములను తాకునది.

| మంత్రము. | క్రియలు. |
|---|---|
| ౧ ఓంతత్సవితుర్వరేణ్యం | ఈమూడుమంత్రములచే, బుడగలు, నురుగులేనిమంచినీళ్లను * బ్రహ్మ |

---

* తీర్థముల వివరము (పటము) చూడుము.

స్వాహా — తీర్థముచే యాచమించవలెను.

౨ భర్గో దేవస్య ధీమహి

స్వాహా

3 ఓంధియోయోనః ప్ర

చోదయాత్స్వాహా

అఙ్గుళ్యగ్రైర్నవభిఃస్పృశేత్.

౧ ఆపోహిష్ఠా మ యో — 1 ఈమంత్రముచే కుడిచేతిని కడిగికొని

భువః

౨ తాన ఊర్జేదధాతన — ఈమంత్రముచేఎడమచేతినికడిగికొని

1. శ్లో॥ అంగుష్ఠతర్జనీభ్యాం నాసికే।అంగుష్ఠమధ్యమాభ్యాం చక్షుషీ శ్రోత్రే అంగుష్ఠానామికాభ్యాం।అంగుష్ఠకనిష్ఠికాభ్యాం నాభిం। తథాతలేన హృదయం।శిరస్సమస్తాంగుళిభిః స్పృశేత్। అంగుళ్యగ్రైరంసౌ।ద్వౌ ద్విజస్సృద్ధిమవాప్నుయాత్॥

| | |
|---|---|
| 3 మహేరణాయ చక్షసే | ఈ మంత్రముచే కుడిగండమును అంగుష్ఠమూలముచే తుడిచి |
| ౪ యోవశ్శివత మోరసః | ఈమంత్రముచే ఎడమగండమును అంగుష్ఠమూలముచే తుడిచి |
| ౫ తస్య భాజయతే హనః | ఈమంత్రముచే పైపెదవిని అంగుష్ఠమూలముచే తుడిచి |
| ౬ ఉశతీరివ మాతరః | ఈమంత్రముచే క్రిందిపెదవిని అంగుష్ఠమూలముచే తుడిచి |
| ౭ తస్మాఅరజమామ వః | కుడిచేతిచే ఎడమచేతిని ప్రోక్షించుకొని |
| ౮ యస్య క్షయాయజిన్వథ | కుడిచేతిచే రెండుపాదములను ప్రోక్షించుకొని |
| ౯ ఆపోజనయథా చనః | శిరస్సును ప్రోక్షించుకొనవలెను. |

సప్తవ్యాహృతిభిశ్చైవ

| | |
|---|---|
| ౧. ఓంభూః | ఈమంత్రముచే ముఖమును తుడుచుకొనవలెను. |
| ౨. ఓంభువః | అని అంగుష్ఠ తర్జనులతో కుడి ముక్కు పుటమునుదాకి |
| 3. ఓంసువః | అని అంగుష్ఠ తర్జనులతో ఎడమ ముక్కు పుటమును దాకి |

| | |
|---|---|
| ౪. ఓంమహః | అని అంగుష్ఠ మధ్యమములతో కుడి కంటిని దాఁకి |
| ౫. ఓంజనః | అని అంగుష్ఠ మధ్యమములతో ఎడమకంటిని దాఁకి |
| ౬. ఓంతపః | అని అంగుష్ఠానామికలతో కుడిచెవిని దాఁకి |
| ౭. ఓంసత్యం | అని అంగుష్ఠ నామికలతో ఎడమ చెవిని దాఁకి |
| శిరోమంత్రైశ్చ | పంచభిరితి. |
| ౧. ఓం ఆపః | అని అంగుష్ఠ కనిష్ఠలతో నాభిని దాఁకి |
| ౨. ఓంజ్యోతిః | అని కరతలమున నెదను దాఁకి |
| 3. ఓంరసః | అని కరాగ్రిముల శిరమును దాఁకి |
| ౪. ఓంఅమృతం | అని ముకులహస్తముతో ఎడమభుజమును దాఁకవలెను. |
| ౫ బ్రిహ్మా భూర్భువ స్స్వ | అని ముకులహస్తముతో డమ భుజమును దాఁకవలెను. |

రోమ్

(దీని వినియోగము గాయత్రి మంత్రజపమునకు పూర్వమందును, పరమందును, బ్రిహ్మాయజ్ఞమందును, సకలశ్రౌత కర్మలయందును గలదు.

౨. స్మృత్యాచమనము. (స్మార్తాచమనము)

స్మార్తాచమన ఉదకపానే మంత్రవిశేషమహ

ఆశ్వలాయనః।

ప్రణవేన త్రిరాచామేద్దక్షిణేనతు పాణినేతి।

అంగోపస్పర్శనంప్రాగ్యోక్త మేవతూష్ణీంకర్తవ్యమితి

తా॥ ఓంస్వాహా, ఓంస్వాహా, ఓంస్వాహా, అని మూడుమార్లు ఆచమించి శ్రౌతాచమనములో చెప్పిన, కరాది అంగములను మంత్రము లేకయే పైనచెప్పినముద్రలచే తాకవలయునని ఆశ్వలాయనుఁడు చెప్పెను.

౨. స్మృత్యాచమనము (స్మార్తాచమనము) శౌనకమతము.

శ్లో॥ నిబద్ధశిఖకచ్ఛస్తు ద్విజఆచమనం చరేత్।

కృత్వోపవీతం సవ్యాంసేవాఙ్మనఃకాయసంయుతః

తా॥ పిగముడివైచుకొని, కచ్చలుకట్టుగొని ఎడమ భుజమున జందము వైచుకొని అసఁగా ఉపవీతియై, వాఙ్మనఃకాయములను నియమించి ఆచమించవలయును.

శ్లో॥ గోకర్ణాకృతిహస్తేనమాషమాత్రం జలం పిబేత్।

తన్న్యూనమధికంవాఽపి సురాపానసమం భవేత్ ॥౧॥

తా॥ అరచేయి గోకర్ణాకారముగఁబట్టి అందు మాషమాత్రజలమును యాచమించవలయును. అంతకంటె హెచ్చుతగ్గులగునెడల నది సురాపానసమమగును.

శ్లో॥ ఆచామేన్మాషమగ్నం చ గోకర్ణచులుకస్థితమ్।

సంహతాఙ్గులినాతోయంగృహీత్వా పాణినాద్విజః

---

మాషమం= గురిగింజగింజంత ఎత్తు (౧।చిన్నము) గురిగింజ గింజలు మునుగునంత నీరు.

తా॥ వ్రేళ్లన్నియుగూర్చి చేతితో మాషము జలమునుగ్రహించి బ్రాహ్మణు డాచమించవలెను. ॥3॥

శ్లో॥ ముక్తాంగుష్ఠ కనిష్ఠాభ్యాం త్రిః పిబేద్బ్రహ్మతీర్థతః।
తతః ప్రక్షాళ్య హస్తేన సజ్జుష్ఠౌ నిమార్జ్యైథ

తా॥ అంగుష్ఠమును చిటికిన వ్రేలు-ఈ రెంటిని వదిలి బ్రహ్మతీర్థముచే ఓంస్వాహా, ఓంస్వాహా, ఓంస్వాహా, అని3 సార్లు ఆచమించవలయును. హస్తములుగడిగికొని, వ్రేళ్ళనుముడిచి పెదవులను ముమ్మారు తుడుచుకొని. ౪

శ్లో॥ సంహతాంగుళిభి ర్మ్యాస్యైగ
త్రిః పరిమృజ్యా తతో ముఖమ్
పరిక్షాళ్య హస్తౌ చాభ్యుక్ష్య
పాదశీర్షా తథైవచ॥ ॥౫॥

తా॥ ముడవబడిన అంగుళీ మూలముతో మొగము మూడుసార్లు తుడుచుకొని హస్తములుకడుగికొని పాదములను, శిరమునను జలమున ప్రోక్షణచేసుకొని.

శ్లో॥ మధ్యమాంగుళిపృష్టైశ్చ త్రిః స్పృశేత్ ఘ్రాణ మూలకమ్।
హస్తౌ పరిక్షాళ్య సంస్పృష్ట్వా ఘ్రాణాది ద్వయశః పృథక్ ॥౬॥

తా॥ మధ్యమాంగుళిపృష్ఠముతో ఘ్రాణమూలమును ముమ్మారు తాకి హస్తప్రక్షాళనముచేసి కొని ముక్కు మొదలగు వానిని ఈ క్రింది తీరున స్పృశించవలయును. ॥౭॥

శ్లో॥ అంగుష్ఠేన ప్రదేశిన్యా ఘ్రాణం పశ్చాదుపస్పృశేత్।
అంగుష్ఠానామికాభ్యాం చ చక్షుశ్శ్రోత్రే చ సంస్పృశేత్ ॥౭॥

తా॥ అంగుష్ఠతర్జనులతో ముక్కురంధ్రములను, అంగుష్ఠానామికలతో కన్నులను, చెవులను, వేర్వేరుగ తాకవలెను.

శ్లో॥ అంగుష్ఠోపకనిష్ఠాభ్యాం నాభింపశ్చాదుపస్పృశేత్
తలేన హృదయంస్పృష్ట్వా స్పృశేదంగుళీభిశ్శిరః॥౮॥

తా॥ అంగుష్ఠోపకనిష్ఠికలతో నాభినితాకి, కరతలముతో హృదయమును, అన్నివేళ్లతోడను, శిరమును దాకవలెను.

శ్లో॥ అంగుల్యగ్రై ర్బాహుమూలే సంస్పృశేదితి శౌనకః।
ప్రణవేనోదకం ధృత్వా హ్యాత్మానం పరిషేచయేత్ ॥౯॥
అనేన విధినా విప్రః కుర్యాదాచమనం సదా॥

తా॥ అంగుల్యగ్రములతో బాహుమూలములను వేర్వేరు స్పృశించవలెను. పిదప "ఓం"యని యుదకమును గైకొని శిరమున చల్లుకొనవలెను. అని శౌనకుడు చెప్పెను.

ఇది శౌనక మతము.

ఆచమన విశేషంబులు, ఆపస్తంబః.

తిష్ఠన్నాచామేత్ = బొడ్డులోతు జలమందుదిగి నప్పుడు తప్ప నిలుచుండి ఆచమించరాదు.

ప్రహ్వోవా = వంగుని ఆచమించరాదు.

ఆసీన స్త్రిరాచామేత్ = పాదము భూమిని స్పృశించునట్లు పీటు
మీద కూర్చొని మూడుసార్లు ఆచమించవలెను.

హృదయజ్ఞమాభి రద్భిః=జలము హృదయమును పొందు
నటుల ఆచమించవలెను.

## పురాణాచమనము.

పూర్వము చెప్పినట్లు సిగ ముడి వైచికొని, మడి వస్త్రద్వయ
మును ధరించి ఉపవీతియై ఈ చెప్పబోవు విధముగ యాచమించ వలెను.

శ్లో॥ ఓంకార పూర్వకం నామ చతుర్వింశతి సంఖ్యయా
స్వాహాన్తైః పాశయేద్వారి నమోన్తైః స్పర్శయే
త్తథా।

అను దేవీభాగవతాహ్నిక ప్రకరణ వచనానుసారము ఓంకారపూ
ర్వకముగను స్వాహాశబ్దాంతముగను చతుర్థ్యంతములగు కేశవాదిశబ్దములు
మూడింటచే నాచమనముజేసి "గోవిందాయనమః" ఇత్యాది శబ్దములచే
శరాద్యంగ స్పర్శనమును జేయవలెనని యూహించునది.

శ్లో॥ కేశవాద్యైస్త్రిభిఃపీత్వా ద్వాభ్యాంప్రక్షాళయేత్కరౌ।
ద్వాభ్యామోష్ఠౌచ సమ్మృజ్య ద్వాభ్యామున్మార్జనం తథా॥

శ్లో॥ ఏకేన హస్తం ప్రక్షాళ్య పాదావపి తథైకతః ।
ఏకేనాపిచ మూర్ధానం తతస్సఙ్కర్షణాదిభిః॥ ॥౨॥

శ్లో॥ సర్వాసామంగుళీనాంవై మూలేన చుబుకం స్పృశేత్।
తర్జన్యంగుష్ఠ యోగేన నాసికే ద్వే ఉపస్పృశేత్ ॥3॥

శ్లో॥ అంగుష్ఠానామికాభ్యాం తు చక్షుశ్శ్రోత్రేఉపస్పృశేత్॥

శ్లో॥ కనిష్ఠాంగుష్ఠయో ర్యోగా న్నాభిదేశ ముపస్పృశేత్।
కరమధ్యం హృది స్థాప్య కరాగ్రం శిరసి న్యసేత్ ॥గి॥
శ్లో॥ ముకుళేనచ హస్తేన బాహుమూలముపస్పృశేత్
ఏవమాచమనం కృత్వా సాక్షా న్నారాయణో
భవేత్ ॥ ౬

ఈపురాణాచమనమును ప్రతిస్మార్తకర్మకు, ఆదియందును, అంతమందును చేయవలెను.

దానిప్రయోగవరుస.

| | |
|---|---|
| ౧ ఓం కేశవాయ స్వాహా. | అనిమువ్మాఱు ఆచమనముచేసి. |
| ౨ నారాయణాయస్వాహా | |
| 3 మాధవాయ స్వాహా. | |
| ౪ గోవిందాయ నమః | కుడికరమును కడుగుకొని. |
| ౫ విష్ణవే నమః. | ఎడమచేతిని కడుగుకొని. |
| ౬॥ ఓంమధుసూదనాయ నమః | అంగుష్ఠమూలముతో పైపెదవిని తుడిచి |
| ౭॥ త్రివిక్రమాయనమః. | అంగుష్ఠమూలముతో క్రిందిపెదవిని తుడిచి. |
| ౮॥ వామనాయనమః | రెంప్రా దర్భలతో జలము శిరముపై జల్లుకొని. |
| ౯॥ శ్రీధరాయనమః. | |
| ౧౦॥ హృషీకేశాయనమః | అనిఎడమచేతిని ప్రోక్షించుకొని |
| ౧౧॥ పద్మనాభాయనమః | అనిపాదముల ప్రోక్షించుకొని. |
| ౧౨॥ దామోదరాయ నమః. | అని శిరమున ప్రోక్షించుకొని. |

| | |
|---|---|
| ౧౩॥ సఙ్కర్షణా యనమః | అనిసర్వాంగుళిమూలముతో గడ్డము దాకి. |
| ౧౪॥ వాసుదేవాయనమః | అనిఅంగుష్ఠతర్జనులతో కుడిముక్కు రంధ్రమునుదాకి |
| ౧౫॥ ప్రద్యుమ్నాయనమః | అనిఅంగుష్ఠతర్జనులతో ఎడమరంధ్రమునుదాకి. |
| ౧౬॥ అనిరుద్ధాయ నమః. | అనిఅంగుష్ఠానామికలతో కుడికంటినిదాకి. |
| ౧౭॥ పురుషోత్తమా యనమః. | అని అంగుష్ఠానామికలతో ఎడమకంటినిదాకి. |
| ౧౮॥ అధోక్షజా యనమః. | అనిఅంగుష్ఠానామికలతో కుడిచెవినిదాకి. |
| ౧౯॥ నారసింహాయనమః. | అని అంగుష్ఠానామికలతో ఎడమచెవినిదాకి. |
| ౨౦॥ అచ్యుతా యనమః. | అనిఅంగుష్ఠకనిష్ఠికలతో నాభినిదాకి. |
| ౨౧॥ జనార్దనా యనమః. | అనికరతలకమునహృదయమునుదాకి. |
| ౨౨॥ ఉపేంద్రా యనమః | కరాగ్రమున శిరమునుదాకి. |
| ౨౩॥ హరయే నమః. | అని ముకుళహస్తమున కుడిబాహుమూలమును దాకి. |
| ౨౪. శ్రీకృష్ణాయనమః | అని ముకుళహస్తమున ఎడమబాహుమూలమునుదాకవలెను. |

ఇట్లుఆచమించిన శ్రీమన్నారాయణునితో సమానుడగును.

## పురాణాచమనభేదః

శ్లో॥ శౌచాచారే తథా పానే స్పృష్ట్వా స్పృష్టే చ పర్వణి।

పౌరాణాచమనం కుర్యాన్నామభిః కేశవాదిభిః॥

తా॥ శుద్ధి నిమిత్తమందును, దాహానంతరమందును, తాకరానివాటిని తాకినప్పుడును, కేశవాది నామములతోఁ జెప్పబడిన పురాణాచమనమును జేయవలెను.

ఆచమనే అనయవస్పృశ్య

శ్లో॥ అంగుష్ఠమూలేనాస్యం ద్విర్ద్విరున్మృజ్య।
ప్రదేశిన్యాదిభి స్తిసృభి స్సహితాభి స్సకృదుపస్పృశే
దాస్యార్థం
తోయంగృహీత్వా దక్షిణేన ప్రోక్షణం సవ్యహస్తే
పాదయోశ్శిరసశ్చ తదనంతరం శిఖాం చోపస్పృశేత్॥
శ్లో॥ అంగుష్ఠ తర్జనీభ్యాం నాసికే అంగుష్ఠ మధ్యమా
భ్యాం చక్షుషీ శ్రోత్రే।
అంగుష్ఠానామికాభ్యాం। అంగుష్ఠకనిష్ఠికాభ్యాం
నాభిమ్,
తథాతలేనహృదయం। శిరస్సమస్తాంగులిభిః స్పృశేత్।
అంగుళ్యగ్రై ర్రంసౌ। ద్వా ద్విజశ్శుద్ధిమవాప్నుయాత్॥

అని.

ప్రయోగః

౧. ఓం కేశవాయస్వాహా
౨. ఓం నారాయణాయ స్వాహా
3.ఓంమాధవాయస్వాహా

ముమ్మాఱు ఆచమనముచేసి.

| | |
|---|---|
| ౪. ఓం గోవిందాయనమః | అంగుష్ఠమూలముతో ముఖమును ౨ సార్లు తుడుచుకొనవలెను. |
| ౫. ఓం విష్ణవేనమః | |
| ౬. మధుసూదనాయనమః | పైవిధముగానే ౨ సార్లు ముఖమును తుడుచుకొనవలెను. |
| ౭. త్రివిక్రమాయనమః | |
| ౮. వామనాయనమః | మధ్యమూడు వేళ్లచే కలిపి ముఖమును తుడుచుకొనవలెను. |
| ౯. శ్రీధరాయనమః | కుడిచేతితో జలమును తీసుకొని ఎడమచేతిని ప్రోక్షించుకొనవలెను. |
| ౧౦. హృషీకేశాయనమః | కుడిపాదమును ప్రోక్షించుకొనవలెను |
| ౧౧. పద్మనాభాయనమః | ఎడమ పాదమును ప్రోక్షించుకొనవలెను. |
| ౧౨. దామోదరాయనమః | శిరమున ప్రోక్షించుకొనవలెను. |
| ౧౩. సంకర్షణాయనమః | శిఖనుఁ దాఁకవలెను. |
| ౧౪. వాసుదేవాయనమః | అంగుష్ఠ తర్జనీలచే కుడి, ఎడమ ముక్కు పుటలనుఁ దాఁకవలెను. |
| ౧౫. ప్రద్యుమ్నాయనమః | |
| ౧౬. అనిరుద్ధాయనమః | అంగుష్ఠ మధ్యములచే ౨ కండ్లనుఁ దాఁకవలెను. |
| ౧౭. పురుషోత్తమాయనమః | |
| ౧౮. అధోక్షజాయనమః | అంగుష్ఠానామికలతో ౨ చెవులను దాఁకవలెను. |
| ౧౯. నారసింహాయనమః | |
| ౨౦. అచ్యుతాయనమః | అంగుష్ఠ కనిష్ఠికలతో నాభినిదాఁకి |
| ౨౧. జనార్దనాయనమః | కరతలమున యెదనుదాఁకి. |
| ౨౨. ఉపేంద్రాయనమః | కరాగ్రమున శిరస్సునుదాఁకి |
| ౨౩. హరయేనమః | ముకుళహస్తమున బాహుమూలలనుదాకునది. |
| ౨౪. శ్రీకృష్ణాయనమః | |

## — తీర్థవివరణము —

శ్లో॥ అంగుల్యగ్రే తీర్థందైవం స్వల్పాంగుల్యోర్మూలే కాయమ్। మధ్యేఽఙ్గుష్ఠాంగుల్యోః పైత్రం మూలేఽఙ్గుష్ఠస్య బ్రాహ్మమ్ ॥

తా॥ వ్రేళ్ళకొనలయందు దైవతీర్థమనియు, కనిష్ఠికామూలమునందు మనుష్య(ఋషి)తీర్థమనియు, అంగుష్ఠతర్జనులనడుమ పితృతీర్థమనియు, అంగుష్ఠమూలంబున బ్రహ్మతీర్థమనియు చెప్పుదురు.

శ్లో॥ కనిష్ఠదేశిన్యంగుష్ఠమూలాన్యగ్రం కరస్యతు।
ప్రజాపతి పితృ బ్రహ్మ దేవతీర్థాన్యనుక్రమాత్ ॥

తా॥ కనిష్ఠికామూలము ప్రజాపతితీర్థము (దీని నేఋషితీర్థమందురు.) తర్జనీమూలము పితృతీర్థము, అంగుష్ఠమూలము బ్రహ్మతీర్థము, కరాగ్రము దేవతీర్థమని చెప్పుదురు. వానిని క్రమముగా, ఋషితర్పణమందును, పితృతర్పణమందును, ఆచమనమందును, సంధ్యార్ఘ్య తర్పణ, దేవతర్పణములందును వినియోగము.

వెనుకపుటలోని ప్రతికృతిహస్తమును చూడుడు.

తీర్థములు.

౧. బ్రహ్మతీర్థము (అంగుష్ఠమూలము)
౨ ప్రాజాపత్యము (ఋషి) తీర్థము (కనిష్ఠికామూలము)
3. దేవతీర్థము (అంగుల్యగ్రములు)
౪. పితృతీర్థము. (తర్జనీమూలము)
౫. అగ్నితీర్థము (కరమధ్యమున)

# ౨. ప్రాణాయామము.

ప్రాణాయామ మనగా ( ప్రాణ + ఆయామః ) ప్రాణములను నియమించుట మన శరీరములోని శ్వాసము నకును, జీవశక్తి నిగూఢ ప్రాణమని పేరు. మొదట శ్వాసమును నియమించుటకు యభ్యాసము చేసిన క్రమముగా జీవశక్తియు నియమితంబగును. కావున ముందు శ్వాసమును నియమించుటకు యభ్యసింపవలయును.

ఇట్టి ప్రాణాయామమునకు అందరు అర్హులే. అందరు దీని నభ్యసింపవచ్చునని హఠయోగప్రదీపకయందు జెప్పంబడినది.

ప్రాణాయామాభ్యాసకుడు ముందుగా యమము, నియమము, ఆసనమును అభ్యసించవలయును.

౧ యమమనగా. ఇంద్రియనిగ్రము.

౨. నియమమనగా అహింస, సత్యము, దొంగిలింపకుండుట, బ్రహ్మచర్యము, భగవద్ధ్యానము.

౩. ఆసనమనగా వెన్ను, శిరము, కణ్ఠము, నీమూ కింటెని ఏకదండముగా నిలిపి వంగకుండ కూర్చుండుట.

సన్ధ్యాదులయందు ప్రాణాయామము ౩విధములు.

౧. పూరకమనగా వెలుపలిగాలిని ముక్కుగుండా శ్వాసకోశములందు బూరించుట.

౨. కుంభకమనగా అట్లు పూరించిన వాయువును వదలనీయక నిలుపుట.

3. రేచకమనగా అట్లునిలిపిన వాయువును ముక్కుగుండా బైటకువిడుచుట.

అభ్యాసప్రకారము.

అభ్యాసకుడు ప్రథమమున కుడిచేతి బొటనవ్రేలితో కుడిముక్కును మూసికొని యెడమ ముక్కుతో నెమ్మదిగా తొందరలేక పూరకము చేయవలెను. ఇట్లు ౪ సెకండ్ల కాలమువరకు పూరించి పిదప కుడిచేతితర్జనీ మధ్యమవ్రేళ్లతోగాని, మధ్యమానామికలతోగాని యెడమముక్కునుమూసి ౧౬ సెకండ్లవరకు కుంభకమును సలుపవలెను. పిదప కుడిముక్కునుండి నెమ్మదిగా ౮ సెకండ్లు రేచకము చేయవలెను. తరువాత కుడిముక్కుతో పూరకమును, ఎడమముక్కుతో రేచకమును పైనచెప్పిన కాలములో చేయవలెను.

ఇట్టివిమూడుసార్లుచేసిన ఒకప్రాణాయామమగును.

ఈప్రకారముపూటకు ౫,౬ ప్రాణాయామములచొప్పున దినమునకు ౪,3 పూటలు చేయవలెను. ఇట్లుప్రారంభించి 3 మాసములకు పూటకు ౧౦ చొప్పునను అభ్యసింపవలెను. ఇట్లు ౫,౬ మాసములుచేసిన ప్రాణశక్తి స్వాధీనమై కుంభకమందు చిరకాలమునిలిచి భగవద్ధ్యానము చేయు శక్తి గలుగును.

ఇట్లే ఎడమముక్కుతో ౫ సెకండ్లు పూరకముసలిపి ౩౦ సెకండ్లు కుంభకముచేసి ౮ సెకండ్లు రేచకముచేయుట అభ్యసించవలెను. ఆకుంభకముచేయు సమయమున సవ్యాహృతికమును, సశిరస్కమును దశప్రణవ సహితమైన గాయత్రీ మహామంత్రమును అనగా:— "ఓంభూః, ఓం భువః, ఓంస్స్వః, ఓంమహః, ఓంజనః, ఓంతపః, ఓంసత్యం, ఓంతత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియోయో నః ప్రచోదయాత్। ఓమాపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్స్వరోమ్" 3సార్లు జపించవలెను. ఇట్లు క్రమముగ అభ్యసించిన చిత్తనిరోధనము చేయవచ్చును.

గృహ్యాపరిశిష్ఠమందిట్లు చెప్పబడినది. "పవిత్రహస్తుడై యాచమించి ముందుగ మంత్రములేకయే ౧౬ ప్రాణాయామముల నాచరించి తరువాత సమంత్రముగ నొకమారు ప్రాణాయామము చేయవలెను.

సంధ్యకు మొదటను, అర్ఘ్యమిచ్చునప్పుడును, నొక ప్రాణాయామమును, గాయత్రికి మొదట చివరను 3ప్రాణాయామములు సేయవలెను.

---

# ముద్రా వివరణము.

గ్రువ్రేళ్ళచే ముక్కుకొనను పట్టుకొనుట "ప్రణవ ముద్ర" ఇది వానప్రస్థగృహస్థులకు పాపహరణమగును. బొటనవ్రేలితోను, చిటికినవ్రేలితోను, అనామికచేతను ముక్కును పట్టినచో "నోంకారముద్ర" అగును. ఇది యతికి బ్రహ్మచారికి తగినది.

## — సంకల్పము. —

ఇది దేశకాల సంకీర్తనపూర్వకముగ చేయఁబడు చున్నది. బ్రహ్మాండాది స్వగృహాపర్యన్తముగల మహత్వ లఘుత్వాది బోధకములగు వచనములతోనుండు పాఠము దేశసంకీర్తనము. అటులే సృష్ట్యాద్యేతత్క్షణపర్యన్తముగల కాలవివరణమును దెల్పు వచనములతోనుండు పాఠము కాలసంకీర్తనము. ఇటులు దేశకాల సంకీర్తనంబుచేసి ప్రకృత కర్మాచరణంబును సఙ్కల్పింతురు.

ఈసంకల్పము (౧) మహాసంకల్పము. (౨) సంకల్పము. (3) లఘుసంకల్పము అని 3విధములు.

అందు (౧) మహాసంకల్పము కన్యాదానాదులందును. (౨) సంకల్పము ప్రతికర్మారంభమందును(3)లఘు సంకల్పము ఏకకర్మాఙ్గములగు నవాన్తరకర్మముల కారమ్భమందును వినియోగింపఁబడుచున్నది.

౧. మహాసఙ్కల్పము మనకప్రకృతము.

౨. సఙ్కల్పము:— ఇది దేశకాలసంకీర్తన పూర్వకముగ చేయబడుచున్నది.

౧. కాలసంకీర్తనము:— శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్ధే, శ్వేతవరాహకల్పే, సప్తమే వైవస్వతమన్వన్తరే, అష్టావింశన్మహాయుగే, కలియుగే, ప్రథమపాదే (౫౦౩౬) షట్త్రింశోత్తరపంచసహస్రితమే.

౨. దేశసంకీర్తనము:— పంచాశత్కోటియోజనవిస్తీర్ణమహీమణ్డలే, లక్షయోజనవిస్తీర్ణజమ్బూద్వీపే, భరతవర్షే, భరతఖణ్డే, మేరోర్దక్షిణదిగ్భాగే, * శ్రీశైలస్యేశానప్రదేశే, కృష్ణాగోదావర్యోర్మధ్యదేశే, స్వగృహే (బంధుగృహే) (విప్రగృహే) సమస్తదేవతాబ్రాహ్మణచరణసన్నిధౌ,

౧. కాలసంకీర్తనము:— అస్మిన్ వర్తమానవ్యావహారిక చాంద్రమానేన ‡ధాతృనామసంవత్సరే, ఉత్తరాయనే, గ్రీష్మఋతౌ, జ్యేష్ఠమాసే, కృష్ణపక్షే, అష్టమ్యాం, భృగువాసరే, పూర్వాభాద్రానక్షత్రే, ప్రీతినామయోగే, బాలవాకరణే,

---

* తమతావు ఎచటనుండునో అటులమార్చుకొనవలయును.

‡సంవత్సరాదులను మార్చుకొనవలెను.

ఏవంగుణవిశేషణ విశిష్టే, శుభేఽభ్యుదయము హూర్తే, శ్రీమాన్ + §హరితసగోత్రః + నారాయణశర్మాభిధేయః, † ధర్మపత్నీసమేతోఽహం శ్రీమతః + హరితసగోత్రస్య + నారాయణశర్మాభిధేయస్య † ధర్మపత్నీ, సమేతస్య, మమోపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ముద్దిశ్య, శ్రీపరమేశ్వరప్రీత్యర్థం సాయంసన్ధ్యాముపాసిష్యే:— ఇతిసంకల్పము.

3. లఘుసంకల్పము:— పూర్వోక్తైవంగుణ విశిష్టే, శుభే, శోభనేముహూర్తే, మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వరముద్దిశ్య, శ్రీపరమేశ్వరప్రీత్యర్థం 1సాయం సంధ్యాంగ 2 గాయత్రీమంత్రజపం కరిష్యే:— ఇది లఘుసంకల్పము.

---

§ తమతమ గోత్రనామములను చెప్పుకొనవలెను.

† గృహస్థులమాత్రమే చెప్పవలయును.

---

౧. ప్రధానకర్మ పేరు చెప్పుకొనవలెను.

౨. అంగమగు కర్మ పేరు చెప్పుకొనవలెను.

# అథ స్వశాఖావిషయే.

## భగవాన్ వసిష్ఠః

శ్లో॥ స్వశాఖావిధముత్సృజ్య అన్యశాఖావిధమాచరేత్।
అప్రమాణ మృషిం కృత్వా అంధే తమసి మజ్జతి।
స్వకం కర్మ పరిత్యజ్య యదన్యత్కురుతే నరః।
అజ్ఞానాదథవా లోభాత్స తేన పతితోభవేత్।
ఋక్శాఖీనైవ కుర్వీత స్వకీయం పరశాఖయా।
ప్రమాదాద్యది కుర్వీత పునస్సంస్కారమర్హతి।
యత్ర నాస్తి స్వశాఖోక్తం ఋక్శాఖోక్తం సమా
చరేత్।
పునర్నార్హతి సంస్కార మన్యథార్హతి చేత్పునః।
యజుశ్శాఖావిధానేన యది బహ్వృచకస్యచ।
కృతేచాపి హి తత్కర్మ పునః కుర్యాద్యథావిధి।
ఋక్శాఖావిధినా కర్మ యది స్యాదన్యశాఖినామ్।
నతత్కర్మ పునఃకార్యమితి యజ్ఞవిదాంమతమ్॥

తా॥ స్వశాఖావిధిని వదలి యితర శాఖావిధి నవలంబింపగూడదు. అట్లుచేసెనేని స్వకీయ ఋషిని తిరస్కరించినవాడై "అంధతమస్సు" అనునరకమునందు మునుగును. స్వకీయకర్మనువదలి యితరమగుకర్మను, అజ్ఞానముచేతనైనను, లోభముచేతనైనను చేసిన పతితుడగును. ఏశాఖ వాడు ఆశాఖనువదలి వేరొకశాఖచే కర్మనాచరించెనేని ; మరల ఉప నయనసంస్కారమును జేసికొనిన శుద్ధుడగును. స్వశాఖీయులు సంభవిం

చనప్పుడు సకల శుభాశుభకర్మలను ఋక్శాఖచే నాచరింపకలయుడు. అట్లుచేసిన పునస్సంస్కారమును జేయ నక్కఱలేదు. బహ్వృచులు యజుశ్శాఖా మొదలగు అన్యశాఖావిధానముచే కర్మలను జేసినయడల మరల ఉపనయనాది సంస్కారమును జేసుకొని యాకర్మమతిరిగి స్వశాఖోక్త విధానముగ జేయువలెను. ఇతరశాఖీయులు ఋక్శాఖోక్త విధానముచే కర్మల నాచరించినయడల మరల జేయునక్కఱలేదు. భగవంతుడగు వసిష్ఠుఁడు వచించెను.



శ్రీగురుభ్యోనమః

# -ఋగ్వేదస్మార్తబ్రాహ్మణ-

# నిత్యకర్మాష్టకము.

## ౧ స్నానప్రకరణము.

శ్లో॥ నదీషు దేవఖాతేషు తటాకేషు సరస్సుచ।
స్నానం సమాచరేన్నిత్యం గర్తప్రస్రవణేషుచ॥
నదీనదతటాకేషు దేవఖాతజలేషుచ।
నిత్యక్రియార్థం స్నాయీత గిరిప్రస్రవణేషుచ॥
స్మృ. ము. విష్ణుపురాణే.

తా॥ నదులందును, నదములందును, తటాకములందును, మనుష్యులచే త్రవ్వబడని సరోవరములందును, కొండవాగులందును, సంధ్యాది నిత్యకర్మలనొనర్చుటకు స్నానము చేయుట ముఖ్యము.

శ్లో॥ అలాభే దేవఖాతానాం సరసాం సరితాంతథా।
ఉద్ధృత్య చతురఃపిండాన్ పారక్యే స్నానమాచరేత్॥ స్మృ. ము. మనుః.

తా॥ పైతీర్థంబులులేనిచోట్ల యితరులు త్రవ్విన తటాకాదులయందైనను స్నానముచేయవలెను. అప్పుడు ౪ మృత్పిండములను తీసివైచి స్నానమొనర్పవలయును.

శ్లో॥ ఉద్ధృత్య వాపి త్రీన్పిండాన్ కుర్యాదావత్సునోసదా
నిరుక్తాసు చ మృత్పిండాన్ కూపాత్త్రీన్ స్వటాన్ తథా।
అనుద్ధృత్యతు యత్స్నానం పరకీయే జలాశయే।

వృధాభవతి తత్స్నానం కర్తుః పాపేన లిప్యతే॥

స్మృ. ము. శౌనకః ।

తా॥ ఇతరులు త్రవ్వించిన తటాగాదులందు స్నానము చేయవలసి నప్పుడు ౩మృత్పిండములను తీసిఒడ్డునవేసియు బావులందు ౩కడవలనీరు తోడి పారఁబోసి స్నానమాచరింపవలయును ॥

శ్లో॥ సంకల్పసూక్తపఠనం మార్జనం చాఘమర్షణం ।
దేవతాతర్పణంచైవ స్నానం పంచాంగముచ్యతే ॥

తా॥ సంకల్పము, సూక్తపఠనము, మార్జనము, అఘమర్షణము, తర్పణము, ఈ ౫ స్నానమునకు నంగములు. ఈ౫అంగములతోఁగూడినదేస్నానము.

శ్లో॥ మంత్రపూతైర్జలైస్స్నానం ప్రాహుస్స్నానఫలప్రదం
నవృథా వారిమగ్నానాం యాదసామివతత్ఫలం॥

స్మృ. ము. వ్యాసః ॥

తా॥ స్నానాంగములను ఆచరించుచు అనగా సమంత్రముగా స్నానమొనర్చిన స్నానఫలము లభించును. గాని యూరకస్నానముచేసిన ఫలముగలుగదు.

శ్లో॥ సంకల్ప సూక్తపఠనం మార్జనం చాఘమర్షణం।
దేవాదితర్పణం చైవ గృహే పంచ వివర్జయేత్ ॥

[ధర్మఖండే.]

తా॥ గృహమందు స్నానముఁ జేయునప్పుడంగము లక్కరలేదు.

## స్నానకాల నిషిద్ధములు.

శ్లో॥ అవగాహ్య జలే నగ్నగ వస్త్రం యః పరిశోధయేత్
కృద్ధాస్తత్ర నివర్తంతే దేవతాః పితృభిస్సహా ॥౧॥

(స్మృత్యర్థసారే.

తా॥ దిగంబరుండై స్నానము చేయరాదు. బట్టలుతకరాదు.

శ్లో॥ స్నానం దానం జపం హోమం స్వాధ్యాయపితృతర్పణం
నైకవస్త్రః ద్విజః కుర్యాత్ శ్రాద్ధభోజన సత్క్రియాః
(స్మృ. ము. యోగయాజ్ఞవల్క్యః.)

తా॥ ఏకవస్త్రుడై స్నానము, దానము, జపము, హోమము, బ్రహ్మయజ్ఞము, పితృతర్పణము, భోక్తృవ్యము చేయరాదు.

శ్లో॥ యావద్దేవాన్ ఋషీంశ్చైవ పిత్రాన్ వై యోన తర్పయేత్ ।
తావన్నపీడయేద్వస్త్రం యేన స్నాతోభవేన్నరః॥

తా॥ స్నానానంతరమునతదంగములగు దేవ, ఋషి, పితృతర్పణములను చేసి స్నానవస్త్రములను పిడువవలయును గాని తర్పణముచేయక పిడువరాదు.

శ్లో॥ స్నానవస్త్రేణ యోవిప్రోగస్వమంగం పరిమార్జతి।
స్నానం వృథైవ భవతిపునస్స్నానేన శుద్ధ్యతి॥

తా॥ స్నానముచేసిన వస్త్రముతో స్నానానంతరమున దేహమును తుడువరాదు. తుడుచుకొనినచో తిరిగి స్నానము చేయవలెను.

శ్లో॥ స్నానం కృత్వాఽర్ద్రివాసస్తుఊర్ధ్వముద్ధృత్యనిక్షిపేత్।
స్నానవస్త్రమధస్తాచ్చేత్పున స్స్నానేన శుద్ధ్యతి॥

తా॥ స్నానానంతరము మడివస్త్రమును ధరించునప్పుడు స్నానవస్త్రమును పైగాతీయవలెను. క్రిందగాతీసిన తిరిగి స్నానము చేసిన పరిశుద్ధుడగును.

శ్లో॥ ఉత్తమంతునదీస్నానం।తటాకే మధ్యమంస్మృతమ్॥
కూపస్నానం తు సామాన్యం । భాండస్నానం వృథా భవేత్ ॥౬॥

తా॥ సులభం.

శ్లో॥ న స్నాయాదాహ్యాద్రహస్తేన నైకహస్తేనవా తథా
ఉద్ధృతాభిరపి స్నాయా దాహృతాభిర్ద్విజాతిభిః

తా॥ శూద్రులచే తేబడిన జలముచేతను, ఒకహస్తముతో తోడి నజలముచేతను బ్రాహ్మణులు స్నానము చేయరాదు.

శ్లో॥ స్రోతసోభిముఖస్స్నాయా న్మార్జనం చాఘమర్షణే
అన్యత్రార్కముఖో రాత్రౌ ప్రాఙ్ముఖోదఙ్ముఖోపి వా
ద. ప్ర. వసిష్ఠ

తా॥ ప్రవాహమున కభిముఖముగ నిలిచి స్నానము, అఘమర్షణ మార్జనముఁ జేయవలయును. నదులుగాని వాటియందు సూర్యాభిముఖముగాను రాత్రి తూర్పుగాగాని ఉత్తరముగాగాని స్నానము జేయవలెను.

## —అథ స్నానమ్—

పరిశుద్ధమగు గోమయమును వామహస్తమందు గ్రహించి, "ఓమ్భూః, ఓమ్భువః, ఓమ్స్వః" అనువ్యాహృతులతో ఉగగంతముగ 3 భాగములఁజేసి దక్షిణభాగమును "ఓమ్." అని యుచ్చరించుచు ౧౦ దిక్కులందు

౧ శ్లో॥ తతోనదీం సమాగత్య గఙ్గాధ్యానపురస్సరమ్।
నాభిమాత్రేజలేస్థిత్వా త్రివారం స్నానమాచరేత్॥ విశ్వామిత్రః

౨ శ్లో॥ నాభిమాత్రే జలేస్థిత్వా కృత్వాకేశాన్ ద్విధాద్విజః।
నిరుద్ధకర్ణనాసస్తు త్రివారం మజ్జనంచరేత్॥ విష్ణుః॥

3 శ్లో॥ త్రిరాప్లుత్య సమాచమ్యశిఖాం బధ్వాసమాచమేత్।
ప్రాణానాయమ్య సంకల్ప్య త్రివారం మజ్జయేత్పునః॥
భగవాన్ ఆశ్వలాయనః॥

వైచి, ఉత్తరభాగమును ఊరక తీర్థమునందువైచి, [నదులందు మృత్పిండములను గూడా వైచి,] ఈక్రిందివిధముగ గంగాధ్యానముఁజేయుచు నదిలోఁ ప్రవేశించి;—

## —గఙ్గాధ్యాన శ్లోకములు.—

శ్లో॥ గఙ్గా గఙ్గేతి యోబ్రూయా ద్యోజనానాంశతైరపి।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి।౧॥

శ్లో॥ అమ్బ! త్వద్దర్శనాన్ముక్తిర్నజానే స్నానజంఫలమ్।
స్వర్గారోహణసోపానే! మహాపుణ్యతరఙ్గిణి! ॥౨॥

శ్లో॥ విశ్వేశం కేశవం ఢుణ్ఢిం దణ్డపాణిఞ్చ భైరవమ్।
వన్దే కాశీంగుహాం గఙ్గాంభవానీం మణికర్ణికామ్॥

శ్లో॥ అతితీక్ష్ణమహాకాయ కల్పాన్తదహనోపమ।
భైరవాయ నమస్తుభ్య మనుజ్ఞాన్దాతుమర్హసి ॥౪॥

శ్లో॥ త్వం రాజాసర్వతీర్థానాన్త్వమేవ జగతఃపితా।
యాచితోదేహిమే తీర్థం సర్వపాపాపనుత్తయే।౫॥

శ్లో॥ తిథిర్విష్ణుస్తథావారో నక్షత్రంవిష్ణురేవచ।
యోగశ్చకరణంచైవ సర్వంవిష్ణుమయంజగత్।౬॥

శ్లో॥ సితా సితే యత్రతరంగ చామరే నద్యావిభాతే మునిభాను కన్యకే। లీలాతపత్రం వటఏవ సాక్షాత్సతీర్థ రాజోజయతి ప్రయాగః ॥౭॥

శ్లో॥ యోఽసౌసర్వగతో విష్ణుశ్చిత్స్వరూపీ నిరఞ్జనః।

సవీవ ద్రవరూపేణ గఙ్గామ్భోనాత్ర సంశయః॥౮॥

శ్లో॥ హరిర్నారాయణో గంగా గంగా నారాయణో హరిః।
హరిర్విశ్వేశ్వరో గంగా గంగా విశ్వేశ్వరో హరిః॥౯॥

శ్లో॥ నన్దినీ నలినీ సీతా మాలినీ చ మహాపగా।
విష్ణుపాదాబ్జ సమ్భూతా గఙ్గా త్రిపథగామినీ॥౧౦॥

శ్లో॥ భాగీరథీ భోగవతీ జాహ్నవీ త్రిదశేశ్వరీ।
ద్వాదశైతాని నామాని యత్ర యత్ర జలాశయే।
స్నానకాలే పఠేన్నిత్యం మహాపాతకనాశనమ్॥

శ్లో॥ పుష్కరాద్యాని తీర్థాని గంగాద్యాస్సరితస్తథా।
ఆగచ్ఛన్తు పవిత్రాణి స్నానకాలే సదా మమ॥౧౨॥

మన్త్రం—సితాసితే సరితే యత్ర సంగతే తత్రాప్లుతా
సోదివ్యముత్పతంతి। యేవైతన్వ౦ విసృజంతి ధీరాస్తే జ
నాసో అమృతత్వం భజంతే॥

(మధ్యమభాగమందలి గోమయమును ఈక్రిందిమంత్రముతో
అభిమంత్రించవలయును.)

ప్రయోగః—: మానస్తోక ఇత్యస్య మంత్రస్య।
కుత్సఋషిః। రుద్రోదేవతా జగతీఛందః। గోమయాభి
మంత్రణే వినియోగః॥ ॥౧॥

"ఓం మానస్తోకేతనయే మానఆయౌ మానో గో
ష మానో అశ్వేషురీరిషః। వీరాన్మానోరుద్రభామితోవధీ
ర్హవిష్మన్త స్సదమిత్వాహవామహే॥"

ఋ. సం. అష్ట. 1. 8. 6.

తా॥ఓరుద్రుడా!మా పుత్రులను,మా పౌత్రులను,మా యితరబంధుజనులను, గోవులను, అశ్వములను, హింసింపకుము. శౌర్యవంతులగు మాజనులందు కోపముగలవాడవై వారలను హింసింపకుము. మేము హవిస్సుగలవారమై నిన్ను సదా యాగములందు పిలుచుచుందుము.

ఓం। గన్ధద్వారా మిత్యస్య సూక్తస్య। ఆనందకర్దమ చిక్లీతేందిరా ఋషయః। శ్రీర్దేవతా। అనుష్టుప్ఛందః। గోమయలేపనే వినియోగః॥ ॥౨॥

మన్త్రః॥ ఓం గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాంకరీ
షిణీం। ఈశ్వరీంసర్వభూతానాం తామిహోపహ్వయే
శ్రియమ్॥[ఈమంత్రముచెప్పి ఆగోమయమునుశిరస్సు మొదలగు అంగములకు పూసుకొని]

శ్లో॥ అగ్రమగ్రం చరంతీనా మోషధీనాం వనేవనే
తాసామృషభ పత్నీనాం పవిత్రం కాయశోధనమ్॥
త్వమేరోగాంశ్చ శోకాంశ్చ నుదగోమయసర్వదా॥

తా॥ ప్రతిదినమందును ఓషధులకుగాను మున్ముందుకు సంచరించు

